## రవి ఆర్ట్ థియేటర్స్!

ఈ సంస్థ నిర్మించిన "భాగస్వాములు" చిత్రాన్ని చూశాను. ఇటీవల వస్తున్న సాంఘిక చిత్రాలతో పోల్చి చూస్తే, యీ చిత్రం ఎన్నో రెట్లు రేటింగుగా వున్నదని చెప్పడానికి సంశయించ పనిలేదు. దర్శకుడు భీమ్‌సింగ్ ప్రతి ఫ్రేములో తన చాకచక్యాన్ని చూపెట్టారు. బాగా డ్రెమటైజ్ చెయ్యబడింది. ఎన్నో ఘట్టాలు కన్నీటిని తెప్పిస్తాయి. ఈ చిత్రానికి రాఘవేంద్రరావు, బసవయ్య నిర్మాతలు.

"అతి మంచివాడు"గా నాగభూషణం గొప్పగా నటించారు అనడంకన్నా అతికిపోయారనడం సబబు అవుతుంది. ఎందుకన. మోతాదు కాస్త ఎక్కువయ్యింటే, పిచ్చివాడు అంటారు. తక్కువయ్యింటే అసమర్థుడు అంటారు. అతిక్లిష్టమైన పాత్రను, కత్తిమీద సాములాంటి పాత్రను నాగభూషణం కచ్చితంగా చేశారు.

"జయంతి వేషం" ఆయన అర్ధాంగిగా. జీవితపు కష్టసుఖాలను సమాన దృష్టితో అనుభవించిన యిల్లాలుగా, కన్న కొడుకుల భవిష్యత్తును తీర్చి దిద్దిన మాతృమూర్తిగా జయంతి అసాధారణంగా నటించి, చిత్ర విజయానికి ముఖ్యంగా తోడ్పడింది.

"భాగస్వాములు" చిత్రానికి సంగీతం ఎంతో సహకరించింది. ఉన్నవి ఆరుదే పాటలు. అయినంటినీ మళ్లీ మళ్లీ వినొచ్చు. సంగీత దర్శకుడు కోదండపాణి లేడే, యీ పాటల పాపులారిటీని వినడానికి.

ఈ చిత్రంలో సత్యనారాయణ, అల్లు రామలింగయ్య, రాజబాబు, చంద్రమోహన్, జయసుధ, కె. విజయ, రాధాకుమారి, జ్యోతిలక్ష్మి ముఖ్య తారాగణం. శ్రీఫిలింస్ విడుదల.

## వేములవాడ భీమకవి

"నటరత్న"గారి ఆరవవ కుమారుడు, వర్ధమాన నాయకుడు అగు చిరంజీవి బాలకృష్ణ "భీమకవి"గా నటిస్తున్న చిత్రం యొక్క తారాగణం ఎవరో పాఠకులకు తెలియాలిగా.

భీమకవి తల్లిగా "షావుకారు" జానకి, కళింగ గంగుగా రామారావు నటిస్తున్నారు. ముఖ్య పాత్రలను సత్యనారాయణ, త్యాగరాజు పోషిస్తున్నారు. కథానాయికగా విజయలలిత నటించడం ఒక ప్రత్యేకత. ఈ చిత్రానికి సముద్రాల రచయిత. డి. యోగానంద్ దర్శకుడు.

ఎన్టీఆర్ — యోగానంద్ కలిసి పనిచేసిన చిత్రాలకు అపజయం లేదు.

# సినిమా విశేషాలు

## మల్లెపూలు ఎందుకని అడిగిన మగువ

శోభన్‌బాబు యింటికి ఆలస్యంగా వచ్చాడు. అతగాడు వచ్చేసరికి, వాణిశ్రీ పడక గదిలో నిద్రపోతూంది. చేతనున్న తెల్లచీరె, మల్లెపూలు ఆమె కోసం ఎంతో ఆశగా తెచ్చాడుకాబోలు. పడక గదిని ప్రవేశించాడు. మెల్లిగా ఆమెను తట్టి లేపాడు. నిదురమత్తుతో ఆవలిస్తూ, ఆమె మంచం దిగింది. అతడు ఆమెని పొదివి పట్టుకుని పెరట్లోకి నడిపించాడు. చీర కట్టుకుని, పూలు పెట్టుకోమన్నాడు. నిదురమబ్బు వీడని ఆమె "అబ్బా... యివన్నీ యిప్పుడెందుకండీ" అని ప్రశ్నించింది.

"ఎందుకంటే ఏమి చెప్పను,
ఏమిటంటే ఎలా చెప్పను,
సద్దుమణిగిన ఈ వేళ, మనమిద్దరమే
వున్నవేళ
తెల్లచీరె తెస్తే...మల్లెపూలు యిస్తే
ఎందుకంటే ఏమి చెప్పను"

అంటూ ఆమెను అమాంతంగా వాటేసుకుని, తన శృంగారపు చేష్టలతో వుక్కిరిబిక్కిరి చేశాడు. ఆమెకూడా అతగాడికి సరైన సమాధానం ఇచ్చింది.

ఈ రసవత్తరమైన రమణీయ దృశ్యం డి. వి. ఎస్. ప్రొడక్షన్స్ వారి రంగుల చిత్రం "జీవన జ్యోతి"లో కనిపిస్తుంది.

బాక్సాఫీస్ నిర్మాత డి. వి. ఎస్. రాజు నిర్మించిన, బాక్సాఫీస్ దర్శకుడు విశ్వనాథ్ రూపొందించిన "జీవనజ్యోతి" చిత్రం సర్వజనరంజకముగా వుండగలదన్న నమ్మకం ప్రేక్షకులకు వున్నది.



"కథానాయకుని కథ"లో వాణిశ్రీ, రామారావు

## ముగ్గురు మూర్తులు!

అంజలీ పిక్చర్స్‌కు క్షేత్రయ్య చెయ్యడానికి అక్కినేని అంగీకరించి, జూన్ నుండి కాల్‌షీట్లు యిచ్చిన వార్త పాఠకులకు విదితమే.

క్షేత్రయ్య అనేసరికి, పిలక వుంటుందేమో అని కొందరు అనుమానపడ్డారు. ఆంధ్రుల అభిమాన అందాల నటుడు అలాంటి రూపంలో అగుపించరు అనేది నిజాన్ని, నిర్మాత ఆదినారాయణరావు చెప్పారు.

క్షేత్రయ్యను శృంగార పురుషుడిగా, మహాకవిగా చిత్రించగలరని తెలుసుకొన్నాను. మేనకోడలుతో ప్రేమ, దేవదాసితో ప్రేమ, మరొక వనితతో ప్రేమ సయ్యాటలాడే క్షేత్రయ్య ఎంత అందగాడైయుండాలి అన్నారు, సంగీత సామ్రాట్ ఆదినారాయణరావు.

క్షేత్రయ్యగా అక్కినేని, ఆ చిత్రానికి సంగీతాన్ని సమకూర్చే ఆదినారాయణరావు, దర్శకత్వాన్ని నిర్వహించే విక్టరీ మధుసూదనరావు గార్లను ముగ్గురు మూర్తులు అనడంలో అతిశయోక్తి కానరాదు.

క్షేత్రయ్యను రచించేది ఆరుద్ర, అందంగా చూపించేది వి. ఎస్. ఆర్. స్వామి, సెట్లను అలంకరించేది వాలి, తోట అయినప్పుడు చిత్రం విలువను కట్టగల స్తోమత ప్రేక్షకులకు లేదా?

## సెక్రటరీకి ప్రేమనగర్ యూనిట్

"ప్రేమనగర్" చిత్రానికి పనిచేసిన టెక్నికల్ యూనిట్ "సెక్రటరి"కి కూడా వుండగలదన్న విషయాన్ని సురేష్ అధినేత రామానాయుడు వెల్లడించారు. ఇది ఈస్ట్‌మన్‌కలర్ చిత్రం.

ప్రసిద్ధ రచయిత్రి యద్దనపూడి సులోచనారాణి రాసిన నవలా సముద్రంలో 'సెక్రటరి'కి ప్రత్యేక గౌరవం వున్నది. అత్యధిక పాఠక ఆదరణను బడసిన యీ నవలకు, రామానాయుడు రమణీయ ఆకృతిని యిచ్చే బాధ్యతను స్వీకరించారు.

ఆంధ్రుల అందాల అగ్రనటుడు అక్కినేని, ఆంధ్రుల అభిమాన అగ్రనటి వాణిశ్రీ కలిసి నటించే "సెక్రటరి"కి దర్శకత్వం నిర్వహించే బాధ్యతను కె. ఎస్. ప్రకాశరావుకు, సంగీతాన్ని సమకూర్చే కార్యాన్ని మహదేవన్‌కు, ఛాయాగ్రహణాన్ని విన్సెంట్‌కు యిచ్చినట్టు, రామానాయుడు చెప్పారు.

అక్కినేని — వాణిశ్రీ జంటకు ప్రేక్షకులలో విపరీతమైన మోజు, క్రేజు వున్నది. ఈ జంటకు యింతవరకు అపజయము లేదు. సురేష్‌కు యీ జంట బంగారు పంటను పండించగలదు.

[19వ పేజీ కూడా చూడండి]



# ఆమె సున్నితమైంది...
# ఆమె అర్థంకానిది...
# ఆమె మృదువైంది, దృఢమైంది,
# సౌందర్యం సంతరించుకున్నది...
# అందుకే ఆమె పరిపూర్ణ స్త్రీ...

పట్టువంటి టాల్కు... అనురాగపూరితమైనది. మిమ్మల్ని అలరించేందుకే... సరిక్రొత్త సువాసనలతో మిమ్మల్ని రంజింపచేసేది...క్షణక్షణం మీలో అపూర్వానుభూతిని కల్గించేందుకు ప్రత్యేకంగా రూపొందించబడింది. అదే మీ వీయిల్ ఆఫ్ లౌ... హేలో మాత్రమే సమర్పించగలిగేది.

## హేలో
## వీయిల్ ఆఫ్ లౌ టాల్క్




## ప్రత్యేకమైన రూ. 1.50 తగ్గింపు అవకాశం

మా ప్రతి ఎకానమీ సైజ్ ప్యాక్ ఖరీదులో

ఈ చుక్కల వెంబడి కత్తిరించండి.

ఈ కూపన్ కత్తిరించండి. మీ పేరు, చిరునామా ఇంగ్లీషులో వ్రాసి కూపన్‌లో గల చిరునామాకు పంపండి. ఆపైన మీకు ప్రత్యేకమైన ఓ డిస్కౌంట్ వౌచర్ లభిస్తుంది. ఆ డిస్కౌంట్ వౌచరను మీ డీలర్ వద్దకు తీసుకువెళితే, అతను మీకు హేలో వీయిల్ ఆఫ్ లౌ టాల్కును మామూలు ఖరీదుకన్న రూ. 1.50 తక్కువకు ఇస్తారు.

ఈ ప్రత్యేకమైన తగ్గింపు సౌకర్యం కొద్ది కాలానికే పరిమితం. అందుకే త్వరపడండి. నేడే మీ కూపన్ పోస్ట్ చేయండి.

COUPON

To
Halo Veil of Love Talc D.O. APW
C/o Colgate-Palmolive (India) Pvt. Ltd.
12-A Ritchie Street, Madras 600 002.

Dear Sirs,
I would like to have my Halo Veil of Love Talc discount voucher sent to :

Name ____________________

Address ____________________

____________________

HT.G.2 TL

# ఉత్తరాలు

### ముఖచిత్రం

30.1.75 వ తేదీ 'ఆంధ్రసచిత్ర వారపత్రిక' "వాణిశ్రీ" ముఖచిత్రం పీట్‌గా లేదు అని అనడానికి సందేహం లేదు. కాని కథలు అవీ చాలా బాగున్నాయి. ముఖ్యంగా కొత్తగా ప్రచురించిన "చిగురించిన జీవితం"సీరియల్ మొదట్లోనే నన్ను విశేషంగా ఆకర్షించింది.

'పి. జి. శివారెడ్డి, (మాచెర్ల.)

* * *

కం. రాజేష్‌ఖన్నా వదనము
రాజీవంబట్లు మిగుల రాణింపగ నా
రోజున వచ్చిన పత్రిక
పేజీలన్నియును నాకు ప్రీతిని గొల్పెన్.

దువ్వూరి రామమూర్తి, (శృంగవృక్షము)

### క్రికెట్

"పటేల్" బొంబాయిలో రెండో యిన్నింగ్స్ బాగా ఆడిన ఆట దొంగలు పడ్డ ఆర్నెల్లకన్నట్టు వృధాకదా ?

బొంబాయి టెస్ట్ ఓటమి మన క్రీడారంగంలో రాజకీయాలు, ఆశ్రితపక్షపాతం వున్నంతకాలం మన గతి యింతేనన్నది రుజువుచేస్తుంది....'ఫార్మ్'లోలేని 'పటేల్'ని వేసుకోడానికి, వికెట్‌లు తీసుకోడంలో 'ఘావ్రీ'తో కలసి జోరుగా బంతులు వేస్తూ "ఫార్మ్'లోవున్న మదన్‌లాల్‌ను వదిలేయటానికి బొంబాయిటెస్ట్ అదను అయిన సమయమా?అన్న ప్రశ్నకి స్కూల్‌బోయ్ కూడా 'కాదని' చెప్తాడు.....దేశంలో యివాళ వున్న క్రికెట్ క్రేజ్ చూస్తుంటే జాతీయ క్రీడాగా "హాకీ"ని గుర్తించటం మానేసి స్కూలు కర్‌క్యులమ్‌లో బేస్‌బాల్‌కి బదులు క్రికెట్‌ను ప్రవేశపెట్టటం మంచిదేమో.... క్రికెట్ వినేవాళ్ళేగాని ఆడేకుర్రాళ్ళు కనిపించటం లేదీ దేశంలో......

పి. వి. జై కిరన్‌కుమార్, (వాల్తేరు.)

### నేడు యువతరం

విద్యార్థులు జాతికే ఖ్యాతి
వాళ్ళకు లేదు ఆ భీతి
భవిష్యత్ సమాజం పాతి
భలేగా వీడారు నీతి
గ్లాసులో దిగింది ఎర్రని ద్రవం
డోస్‌తో మొదిలింది విషబీజం
కుర్రతనం కుతకుతలాడింది
కన్నెతనం కసికసిగా నలిగింది
పరీక్షలు పక్కగా నెట్టారు
జీవితం పట్టాలు తప్పారు !

చైతన్య, (పార్వతీపురం)

### మినీ ఇంటర్వ్యూ

7—2—75 పుస్తకంలోని "మినీ ఇంటర్వ్యూ". నటనకు వయసుతో గల సంబంధమేమిటో నా కర్థం కాలేదు ఈనాటి హిందీ సినిమాలు "తెలుగు" నుంచే కాపీ కొట్టుచున్నవన్న సంగతి సోదరికి తెలియదనుకుంటాను.

కమ్యూనిస్టులను, హిందీని చేరదీయ కూడదు. ఒకరు నిరంకుశులై మిగతా రాజకీయ పార్టీలను రద్దు చేస్తే, ఇంకొకటి మిగతా భాషలను నొక్కిపెట్టి పైకి రావటానికి ప్రయత్నిస్తుంది.

దుద్ది రామకృష్ణ, (రూర్కెలా)

### ఫాలాకునిడైరీ

మీరు (14—2—75)వ తేదీ పత్రికలో ప్రచురించిన ఫాలాక్టుని డైరీలో పిల్లల్ని మింగిన రోలరు అని వ్రాసినారు. కాని ఇది తప్పు. ఇది మా ఇంటికి సమీపంలోనే జరిగినది. పిల్లల్ని మ్రింగినది రోలరు కాదు. ఒక పెద్దరాయి. పైన కొండమీది నుంచి పడింది.

ఏ. ఇందిర (చిత్తూరు)

### నమ్మ నమ్మకపో

పోయినవారం (28—2—75) సంచికలో 7వ పేజీలో పడిన 'నమ్మ నమ్మకపో' విశేషాలు సేకరించి పంపినవారు సి. ఎస్. లక్ష్మిగారు. పాఠకులు యీ విషయం గమనించగోరుతాము. సం.

# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
(1938 - 1972)

శుక్రవారం : 7-3-'75

ఆనందనామ సం. మాఘమాస బ. దశమి

సంపుటము : 68 సంచిక : 25

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

★

సంవత్సర చందా – రు. 33-80 పై.
ఆరుమాసాల చందా – రు. 16-90 పై.
విడిప్రతి వెల 60 పైసలు

ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ-520003.


## విషయానుక్రమణిక



## లోకం పోకడ — ఊమెన్



## మనలో మాట

ఈ వారం నుంచి ప్రారంభమవుతున్న సీరియల్ కథా రచయిత శ్రీ పాలడుగు వెంకటేశ్వరరావు ఆంధ్ర సచిత్ర వారపత్రిక పాఠకులకు సుపరిచితులే!



1939 ఆగస్టు 15వ కృష్ణా జిల్లా గుడివాడ తాలూకా జామాదింట కుర్రులో పుట్టారు. ఇంజనీరు. పిడబ్ల్యూడి శాఖలో నేలకొండపల్లిలో అసిస్టెంట్ యింజనీర్ ఉద్యోగం చేస్తున్నారు.

కథలు రాయటం ప్రారంభించిన దాది యిప్పటికి వివిధ పత్రికల్లో 200 దాక కథలు పడ్డాయి. మూడు నవలలు వెలువడ్డాయి. భారమైన గంభీరమైన వస్తువుని కూడా హాస్యరస మిళితమైన శైలిలో చెప్పి కథ ముగింపు అనుకోని విధంగా చేసి పాఠకులను ఆకట్టుకొనే నేర్పుగల వీరి రంగుల వల మా పాఠకులకు నచ్చుతుందని అనుకుంటున్నాము.

రంగుల వల సీరియల్‌కి బొమ్మలు వేసిన శ్రీ "గోపి" యీ మధ్య ఆంధ్ర సచిత్ర వారపత్రిక పాఠకులకు కొన్ని కథలకు వేసిన బొమ్మల ద్వారా సుపరిచితులే. యువకుడు. ఉత్సాహవంతుడు అయిన శ్రీ గోపీ హైదరాబాద్‌లో ఫైన్‌ఆర్ట్స్‌లో ఐదేళ్ల డిప్లొమా కోర్సు నభ్యసిస్తున్నారు.



"నా జీవితమే బొమ్మలు. బొమ్మలే నా జీవితం" అని తన ఆశయంగురించి పేర్కొన్న యీ యువ చిత్రకారుని బొమ్మలు మా పాఠకులకు నచ్చుతున్నాయని అనుకుంటున్నాము.

# హైదరాబాద్ నోట్‌బుక్ —తిరుమల రామచంద్ర

### ముఖ్యమంత్రి ప్రకటన :

రాష్ట్రప్రభుత్వం తీసుకుంటున్న చర్యలవల్ల రాష్ట్రంలో బియ్యం ధరలు త్వరలో తగ్గగలవని ముఖ్యమంత్రి ఫిబ్రవరి 2న శాసనసభలో ప్రకటించడం జంటనగరాల వారికి చాల సంతోషం కలిగించింది. "సర్వారంభా: తండుల ప్రస్థమూలా:" (అన్నీ బియ్యంపై ఆధారపడి ఉంటాయి) అన్న సంస్కృతం సామెత అన్నట్టు బియ్యం ధరమీదే అన్ని ధరలు ఆధారపడి ఉన్నాయి. అది తగ్గితే అన్ని ధరలూ తగ్గుతాయి. కొందరు పెద్ద రైతులు, మిల్లు యజమానులు వరి, బియ్యం రహస్యంగా నిల్వ చేయటం వల్లనే ధరలు పెరిగాయని, ప్రభుత్వం వారిని క్షమించదని ముఖ్యమంత్రి హెచ్చరిక చేయడం చాల ఆశాజనకంగా ఉంది. తమిళనాడులో రూపాయకు పడి బియ్యం కొలుస్తామని డి. ఎం. కె. వారు చెప్పి ఎన్నికలలో గెలిచారు. ఇప్పుడు పడి ఆరు రూపాయలు ఉంది. మన ప్రభుత్వం ధరలు తగ్గిస్తే వచ్చే ఎన్నికలలో 288 శాసనసభా స్థానాలు కాంగ్రెసుకే వస్తాయి.

### అకాలంలో వడగళ్ల వాన

దరిద్రుడు తల గడిగితే వడగళ్లవాన— అని సామెత. కాని ఈ సామెతకు ప్రసక్తి లేకనే ఫిబ్రవరి 6వ తేదీ సాయంకాలం జంటనగరాలలో గంటకు ముప్పయి మైళ్ల వేగంతో గాలివాన వీచి వడగళ్లవానపడి నానా బీభత్సం కలిగించింది. తగ్గు ప్రాంతాలన్నీ చాల నష్టం పాలయాయి. రామ్‌నగర్ ప్రాంతంలో ఒక సిమెంటు రేకుల కప్పు కూలి, ఎనిమిది మంది పిల్లలు గాయపడ్డారు. గాలి విసురుకు పెక్కు చోట్ల చెట్లు, టెలిగ్రాఫ్ స్తంభాలు పడిపోయాయి. పెక్కు చోట్ల దుకాణాల రేకు కప్పులు లేచి పోయాయి. ఈ గాలివానవల్ల అఖిలభారత పారిశ్రామిక ప్రదర్శనం 6వ తేదీన మూసివేయబడింది.

### కళా ప్రదర్శనలు

ఈ రెండు మూడు వారాలను కళా ప్రదర్శన వారాలు అంటే సరిపోతుంది. అఖిలభారత పారిశ్రామిక ప్రదర్శనంలో హైదరాబాద్ ఆర్ట్ సొసైటీ ఎగ్జిబిషన్ కమిటీల యాజమాన్యాన 34వ అఖిలభారత కళా ప్రదర్శనం జరిగింది. ఇది జనవరి 25 నుంచి 10 ఫిబ్రవరి వరకు విశేషంగా ప్రజలను ఆకర్షించింది. దీనిలో దాదాపు 70 మంది కళాకారుల 84 శిల్పాలు, చిత్రాలు ప్రదర్శింపబడ్డాయి. శ్రీ ఎక్కా యాదగిరిరావు గండరించిన శిల్పం— "హిందూ మహాసముద్రంలో మాకు శాంతి కావాలి" అనే శీర్షికతో ప్రదర్శితమైన రెండు చేపల ఇనుపరేకుల శిల్పం స్వర్ణ పతకం పొందింది. ఈ ప్రపంచం నుంచి ముందుకు తోసుకు వస్తున్న మానవుని సూచించే "మానవుడు" అనే చిత్రంలో శ్రీ శ్రీహరిభాలేకర్ తమ అపూర్వ భావుకతను సూచించారు. శ్రీ పి. ఎస్. చంద్రశేఖర్ "ఆక్రమణ" అన్న చిత్రం, శ్రీ కె. అంజయ్య "పెయింటింగ్—1" చిత్రం, శ్రీ బి. ఎ. రెడ్డి "దోపిడీ" చిత్రం, శ్రీ కె. రాజయ్య "కాస్మిక్ వర్షిపర్" చిత్రం, శ్రీ ఆర్. సి. ఎస్. సన్యాల్ "మాయా—3" చిత్రం, శ్రీ సుధీర్ సక్సేనా— "శిఖరాగ్ర చర్చలు"—. ఈ ఏడింటిలో మొదటి అయిదు చెరి రూ. 400, చివరివి చెరి 250 రూపాయలు బహుమతి పొందాయి. ఎగ్జిబిషన్ కమిటీ ఉపాధ్యక్షుడు శ్రీ మోహన్‌రెడ్డి ఈ కళా ప్రదర్శనం ప్రారంభించారు. బహుమతులను విద్యామంత్రి శ్రీ ఎం. వి. కృష్ణారావు పంచిపెట్టారు.

ఫిబ్రవరి మొదటి వారంలో శ్రీమతి కమలేష్ కళాభవన్‌లో 14 నైరూప్య చిత్రాలు ప్రదర్శించారు. ఆమె తమ చిత్రాలలో స్వాతంత్ర్యానంతరం ప్రజలలో వారి హృదయాలలో కలిగిన సంక్షోభాన్ని వ్యాఖ్యానించారు. మరొక చిత్రకారిణి ఇలాపాల్ తమ యిటీవలి చిత్రాలు పద్నాల్గింటిని తమ భవనంలో ప్రదర్శించారు. ఇలాపాల్ చిత్రాలు దళితులకు, పీడితులకు ఎప్పుడూ ఆశాసందేశమిచ్చేవే. ఈ చిత్రాలలో "స్త్రీ" అనేది ఉత్తమోత్తమ మనుకుంటాను. సుప్రసిద్ధ చిత్రకారుడు శ్రీ వై. బాలయ్య (ఎం. ఎ., బి. ఇ. డి.) 32 బాతిక్ చిత్రాలను అఖిలభారత పారిశ్రామిక ప్రదర్శనంలో ప్రదర్శించారు. గజాసుర మర్దనం, పెండ్లి వూరేగింపు చాల జనాన్ని ఆకర్షించాయి.

### ఉపశ్రుతి :

అసెంబ్లీకి పరిగెత్తుతున్నాడు వో ఆఫీసర్ మిత్రుడు. "ఎందుకండీ అంత తొందర!" అన్నాను. "ప్రశ్నల సమయంలో ఉండాలి కదా! మంత్రిగారికి సమాధానాలు అందివ్వవద్దూ!" అన్నాడు ఆయన. "మీరే సమాధానం చెబితే పోలేదూ?" అన్నాను. "సమాధానం చెప్పగలవాణ్ని ప్రజలు ఎందుకు ఎన్నుకుంటారండీ! మీ వెర్రిగాని" అన్నారు. ●



హైదరాబాద్‌లో జరిగిన 34వ అఖిలభారత కళా ప్రదర్శనంలో బంగారు పతకం పొందిన శిల్పం.

వైదేహీ మూర్తి అరమరికలు లేకుండా కబుర్లు చెప్పకుంటూ ఆఫీసులు లేని సమయాల్లో సినిమాలకీ షికార్లకీ తిరుగుతున్నారు. వైదేహికీమధ్య రుచికరమైన పదార్థాలతో భోజనం కూడా దొరుకుతోంది. పాండురంగమూర్తి యే కొత్త ప్రయోగం చేసినా దానిరుచి చూసే బాధ్యత వైదేహి మీద పడింది. రోజులు క్షణాల్లా గడుస్తున్నాయి. సాధ్వీమణి ఈమధ్య అస్సలు మాటలు తగ్గించేసి సూటీపోటీగా యేదేదో అనేస్తోంది. వైదేహికి వళ్లు మండి "యింతకీ మీరనేదేంటి" అంటూ నిలదీసింది ఒకనాడు.

"అబ్బే యేంలేదు. మూర్తిగారుండగా మీకింక కాలక్షేపానికేం కొదవ అన్నాను అంతే." అంటూ వ్యంగ్యంగా నవ్వింది.

"మీరూ రాకూడదూ! కాలక్షేపం అవాలంటే" వురిమిచూస్తూ అంది వైదేహి.

"నేనేం మారని రూపాయిని కాదు నీలా! నాకు యిల్లు వుంది. యిల్లాలిని నేను"

"ఏంటీ! నేను...మారని రూపాయినా! మళ్లీ అను చెంపలు వాయించేస్తాను" మీద మీదకెళ్లింది వైదేహి.

"నే అనలేదు లోకం అంటోంది. ఆ మాటే నే అంటున్నాను. ఈ చుట్టూ సమాజం అంటోంది తెల్సునా. నీలాంటి ఆడపిల్లలు మూలంగానే ఈనాడు మగాడు మంచివాడుగా వుండలేకపోతున్నాడు..."

మరీ రెచ్చిపోతూంది సాధ్వీమణి. వైదేహి నిప్పులు కక్కుతూ సాధ్వీమణి మీదకి వెడుతూంటే అప్పటికి రెండు నిమషాల ముందు ఆఫీసు నించి వచ్చి తన గదిలోకి పోబోతూ పిల్లద్ధరి కేకలకి మెట్లమీదె ఆగిపోయిన పాండురంగమూర్తి వైదేహి అలా సాధ్వీమణి మీదకి వెళ్లటం చూసి చప్పున వచ్చి వైదేహిని గట్టిగా పట్టుకుని ఆపుతూ.

"వైదేహిగారూ! యేమిటిదంతా!" అంటూ బరబరా పైకి లాక్కువెళ్లా




*(గత సంచిక తరువాయి)*

వైదేహికి ఆవేశం తగ్గింది కాస్త. మూర్తి పిడికిట్లో యింకా కుడిచెయ్యి నలిగిపోతూనే వుంది. రెండు క్షణాలు ఒకరి ముఖంలోకి ఒకరు చూసుకున్నారు. మూర్తి పిడికిలి మెల్లగా వదులైపోయింది.

"సారీ వైదేహిగారూ" అంటూ మూర్తి గభాలున గది తాళం తీసుకుని లోపలికి వెళ్లి తలుపు ఘడియ బిగించేసుకున్నాడు.

"సారీ. నే చెప్పాలి మూర్తిగారూ! ఒక్క క్షణం తలుపుతెరవండి. జరిగింది చెప్తాను. ప్లీజ్"

"ప్లీజ్ వైదేహి! కాస్సేపు నన్ను వంటరిగా వదిలెయ్యండి" మూర్తి గొంతు అతి దీనంగా మెల్లిగా విన్పించింది. వైదేహి ఏం చెయ్యలేక తన గదిలోకి వచ్చి మంచం మీద పడిపోయింది.



వెధవ సమాజం. బాధపడుతూంటే సానుభూతి చూపదు కానీ సుఖంగా వుంటే ఈర్ష్య చూపుతుంది. ఈ సాధ్వీమణిలో యింత ఈర్ష్యాసూయలు దాగివున్నాయా, తనతో మాట్లాడితే ఫర్లేదు కానీ నాతో మాట్లాడితే యింత అసూయపడిపోయిందెందుకు. యెవరెన్ని విధాల అన్నా నేను భయపడనూ పడనూ పడనూ.

ఆ రాత్రి వైదేహి భోజనం చెయ్యలేదు. ప్రక్కగదిలోని మూర్తి భోజనంచేసిన అలికిడి విన్పించలేదు. కానీ రాత్రి పన్నెండు గంటల వరకూ లైటుమాత్రం వెలుగుతూనే వుంది.

* * *

రెండు రోజులు అతినెమ్మదిగా గడిచాయి. వైదేహి లోపల లోపల వుడికిపోతోంది. మూర్తి పల్కరిస్తే మాట్లాడాలని యెదురు చూస్తోంది కానీ మూర్తి యేం ఆలోచిస్తున్నాడో తెలియదు. సాధ్వీమణి ఆఫీసుకి వెళ్ళకుండా యింట్లోనే వుండిపోయిందియెందుకో. వైదేహికి పల్కరించ బుద్ధికాలేదు. ఆఫీసులో పని సరిగా చెయ్యక ఆఫీసరుచేత చివాట్లుతిని యేడుపు మొఖంతో యింటికి వచ్చేసినవైదేహి మూర్తిగది తలుపు తెరిచివుండటంచూసి ఈ బ్రహ్మచారి మహాశయుడు అప్పుడే ఇల్లు చేరాడేం. అని క్షణం తటపటాయించి ఏమైనా సరే అని మూర్తిగదిలోకి అడుగుపెట్టింది. మంచంమీద కళ్ళుమూసుకు పడుకున్నమూర్తి చెప్పల చప్పుడికి కళ్ళుతెరిచిచూసి లేచి కూర్చుంటూ.

"రండి" అన్నాడు.

వైదేహి కుర్చీ లాక్కుని కూర్చుని మూర్తి ముఖంలోకి చూసింది క్షణం. యెప్పుడూ నవ్వుతూ వుండే ముఖం చిన్నబోయివుంది. కళ్లు పీక్కుపోయి వున్నాయి. జ్వరం పడిన వాడిలా వున్నాడు.

"వంట్లో బాగాలేదా!"

"బానే వుంది" అన్నాడు మాసిన గడ్డాన్ని చేతితో రాచుకుంటూ.

# కృష్ణశాస్త్రి కవితా స్వర్ణోత్సవం




అధునికయుగంలో తరుగని విలువతో, మాయని వన్నెతో
అఖండజ్యోతులుగా నిలిచే పద్యాలు, గీతాలు, పాటలు, నాటికలు

## సన్మాన సంఘ విజ్ఞాపన

77 వసంతాలు నిండిన పరువపు యువకవి శ్రీ దేవులపల్లి వేంకటకృష్ణశాస్త్రిగారు. భావబంధురకవితోద్యమ కీర్తిపతాక. నవ్య సాహిత్యరంగంలో సుడిగాలిలా 1925 లో వెలువడింది వారి 'కృష్ణపక్ష' పద్యకావ్యసంపుటి. ఆ పదారు వన్నెల బంగారు కవితకు స్వర్ణోత్సవ వత్సరం 1975—ఈ సంవత్సరాన్నే ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం "తెలుగు సంస్కృతి వికాస వత్సరం"గా ప్రకటించి ఉండడం విశేషం.

కవీశ్వరులైన శ్రీ కృష్ణశాస్త్రిగారిని సమర్హస్థాయిని సన్మానించి, అభినందించడానికి పెద్దల, ప్రముఖుల అండదండలతో సన్నాహాలు చురుకుగా సాగుతున్నాయి. పుస్తకరూపంలో అందుబాటులో లేనివి వారి అపురూపపు రచనలలో ఆరు సంపుటాలు ఎదురుచూస్తున్న తెలుగువారికి స్వర్ణోత్సవసమర్పణగా వెలువడుతున్నాయి. శ్రీ శాస్త్రిగారి ప్రతిభావ్యుత్పత్తులకు నివాళించే ఆకర్షణీయమైన అభినందన సంచిక కూడా తయారవుతూంది.

స్వర్ణోత్సవ సన్మానసదస్సు మదరాసు నగరమున మార్చి 29 న.

మార్చి 22లోగా స్వర్ణోత్సవసందర్భంగా రూ 50 లకు తక్కువకాకుండా కట్నంగా (మనియార్డరు గాని, డ్రాఫ్టు గాని) పంపే కృష్ణశాస్త్రికవితారసజ్ఞు లందరి పేర్లు నంబరువారీని సన్మానసంఘసభ్యుల పట్టికలో నమోదవుతాయి; వారికి సభ్యత్వ గౌరవలాంఛనము, సభ్యుల పట్టిక గల అభినందనసంచిక, అందమైన స్వర్ణోత్సవసంపుటాలు ఆరూ పోస్టు ఖర్చు లేకుండా చేరగలవు. సభ్యత్వపు కట్నం పంపగోరే వారికి ఈ దిగువ నున్న ఫారను నమూనాకు ఇవ్వడమైంది.

కృష్ణశాస్త్రికవితాస్వర్ణోత్సవం జయప్రదమయేలా తోడ్పడవలసిందని రసజ్ఞసోదరు లందరికీ విజ్ఞప్తి.

**దేవులపల్లి కృష్ణశాస్త్రి సన్మానసంఘం**

సభ్యత్వపు కట్నం పంపడానికి అడ్రసు :

శ్రీ యం. యన్. రావు,
ప్రచారకార్యనిర్వాహకుడు,
దేవులపల్లి కృష్ణశాస్త్రి సన్మానసంఘం,
14, మంగురామచెట్టి వీథి,
మదరాసు - 1.

ఆర్యా,

కృష్ణశాస్త్రికవితాస్వర్ణోత్సవ సందర్భంగా కట్నంగా రూ......లు (M.O./డ్రాఫ్టుగా) పంపుతున్నాను. నాకు సభ్యత్వగౌరవలాంఛనము, అభినందనసంచిక, స్వర్ణోత్సవసంపుటాలు పంపగలరు.

సం॥

పేరు :..............................................

చిరునామా :..............................................

..............................................

రెండు నిమిషాలు నిశ్శబ్దంగా జరిగాయి. యేన్నో చెప్పాలని వైదేహీ వచ్చిందేకాని తీరా అతన్నిచూసి అన్నీ మింగేసుకుంది. మూర్తి పరిస్థితీ అలాగే వుంది.

"సారీ మూర్తిగారూ! నేనా రోజు..."

"వైదేహీ! సారీ చెప్పవల్సింది నేను. నా వల్ల అకారణంగా వాదు మీ మీద పడుతోంది. సాధ్వీమణి అలా అన్నందుకు నేను క్షమాపణ అడుగుతున్నాను. మీరారోజు ఆ మాటలకి గాయపడ్డారన్నీతెల్సు. అయితె యేం చెప్పి మీ బాధని పోగొట్టగలనో అర్ధంకావటం లేదు. వంటరిగా వున్న ఆడపిల్ల అందులో అవివాహిత అయిన మీరు నాతో కాస్త చనువుగా తిరగటం అనుమానానికి కారణం అవుతుంది నిజమే. నలుగురు నాలుగు రకాలుగా అనుకుంటారు అదీ నిజమే. నేనే చాలా పొరపాటు చేశాను."

"అంటే" వైదేహీ ముఖం ఎర్రగా చేసుకు అడిగింది. ఏంలేదు మీరు 'స్త్రీ' కాకుండా పురుషుడైవుంటే మనం యిద్దరం యెంత స్నేహితంగా వున్నా యెవ్వరూ యేం అనటానికి అవకాశం లేదుగా. చూడండి. అందం అయిశ్వర్యం, పదవి, హోదా యిలాంటివన్నీ ఈరోజు వుండచ్చు రేపు పోవచ్చు. కానీ పవిత్రమైన స్నేహితం వుంది చూశారూ అది... అది జీవితాంతం మధుర స్మృతిగా మనస్సులో మిగిలిపోతుంది. యిందుకే నాకు స్నేహితం అంటే వెర్రి అభిమానం. నాకు స్నేహం చెయ్యటం రాదు. అందులో మీలాటి అమ్మాయిలతో అసలే మాట్లాడటం రాదు. మీరే చొరవగా నాదగ్గరికి వచ్చినందుకు యెంతగానో సంతోషిస్తున్నాను. అయితే... ఈ అపశృతులు వింటే..."

"యెవ్వరూ అనలేదు. సాధ్వీమణి అమాయతో అన్న మాటలు అవి"

"వైదేహీసాధ్వీమణి స్వతహా చాలామంచిది. నెమ్మదస్తురాలుకూడా. నేనంటేచాలా అభిమానంకూడా. నాకు బాగా తెల్సు. కానీ ఆరోజు అలా యెందుకు మాట్లాడిందో తెలియదు. ఆమె ఈమధ్య యేదో మానసికంగా బాధపడుతున్నట్లు గమనించాను. కానీ కారణం తెలియదు. అడిగినా చెప్పలేదు. బహుశా భార్యాభర్తల మధ్య యేదైనా చికాకులేమో అనుకున్నాను. ఈ అశాంతిలోనే మిమ్మల్ని ఏదో అనేసింది అంతే వైదేహిగారూ."

యివన్నీ చెప్పి కాస్త తేలిక పడినట్లుగా చూశాడు మూర్తి.

వైదేహీ విస్సురుగా తలతిప్పి "ఏది ఏమైనా సాధ్వీమణి అదృష్టవంతురాలు. మిమ్మల్ని శంకించినా మీరు మాత్రం చాటున కూడా ఆవిడమీద ఈగవాలనివ్వనంటున్నారు. మీమనస్సు అతి విశాలం కావచ్చు. కానీ నేనిలాంటివి సహించలేను మూర్తిగారూ. పెళ్ళి ఆలస్యమైనంతమాత్రాన నా ప్రవర్తనని శంకించటానికి ఈవిడ యెవరు? నేనేకాదు. ఆత్మాభిమానం వున్న యే ఆడపిల్లయినా ఆవిడని వదలదు. ఆరోజు మీరు సమయానికి రాకుంటే చెంపలు వాయించేదాన్ని తెల్సునా!"

"వైదేహిగారూ... క్షమించమని అడిగినా ఆవేశపడుతున్నారా!"

"మీరు ఆ మాటలు పట్టించుకోకుండా మళ్ళీ మామూలుగా వుంటేనే నేనా విషయం వదిలేసేది. నేను సాధ్వీమణికే-కాదు నా తల్లిదండ్రులకైనా భయపడను. నాకు మంచిది అని తోస్తే చేసెయ్యటమే నా పని, పర్యవసానం యెలా వున్నానరే"

"యేపనైనా ఆవేశంగా కాదు ఆలోచనతో చెయ్యటం అలవాటు చేసుకోవాలి వైదేహిగారూ"

"ఆ'గారు'తీసి అవతల పారేయమనిచెప్పాను మీరు వినటంలేదు"

"అలాగే" అంటూ వాకిలివైపు చూసి లేచినిల్చుని.

"సాధ్వీమణిగారా! రండిలోపలికి" అన్నాడు సాధ్వీమణి మెల్లగా లోపలికివచ్చింది. వైదేహి "నే వెళ్లి వస్తాను" అంటూ మూర్తి వుండమని చెప్తున్నా వినక తనగదిలోకి వచ్చేసింది. అవతలగదిలోనించి యేవేవో మాటలు అస్పష్టంగా విన్పిస్తున్నాయి. అవి వింటూ పోస్టుమేన్ విసిరిన కవరుతీసుకుని విప్పిచదువుకుంది.

ఈ నెల చాలా యిబ్బందిగా వుంది గనుక డబ్బు యెక్కువ పంపటానికి ప్రయత్నించమనీ, దుబారా ఖర్చులు చేసేప్పుడు యిక్కడి పరిస్థితులు గుర్తుచేసుకోమనీ, తండ్రి రాసిన పుత్తరం.పుత్తరంలో అంతకిమించి మరే సంగతులూ వుండవని వైదేహికి తెల్సు. పండగ యేదైనావస్తే శలవుపెట్టి రమ్మని రాయరు. 'వీలుంటేరా. కానీడబ్బు మాత్రం ముందే పంపు' అని రాసే తల్లిని నమిలిమింగేయాలన్నంత కోపం వస్తూ వుంటుంది వైదేహికి. అసలు జీతం అంతా తనేఖర్చు చేసుకుని

---

# వారఫలం

## 7-3-1975 శుక్రవారం మొదలు 13-3-1975 గురువారం వరకు

మేషం :— అన్ని వ్యవహారాల్లోను గౌరవంలభిస్తుంది. స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి. ప్రయోజనంగల పరిచయాలు యేర్పడతాయి. మీరు యిదివరకు చేసిన ప్రయత్నాలు ఫలిస్తాయి. సాహసిక వ్యవహారాలు బాగుంటాయి. స్త్రీలకు — ఆరోగ్యం బాగుంటుంది. శుభకార్యాల విషయంలో అనుకూలత లభిస్తుంది.

వృషభం :— రావలసినడబ్బు అందుతుంది. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. మిత్రులకు సహాయం చేస్తారు. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. మీ కంటే పెద్దవారుకూడా మీ సహకారాన్ని కోరవలసి వస్తుంది. స్త్రీలకు — పుణ్యకార్యాలు చేస్తారు. సంతోషకరమైన సమాచారం అందగలదు.

మిధునం :— మీ ప్రయత్నాలకు ఆటంకాలు వస్తాయి. ప్రయాణాల్లో శ్రమ కలుగు తుంది. సాహసిక వ్యవహారాల్లో నష్టం రాగలదు. వారం ఆఖరులో మీ కార్యక్రమాలు బాగుంటాయి. వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి. స్త్రీలకు — ఆరోగ్యం బాగుండదు. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

కర్కాటకం:— ఇతరులతో కలిసి చేసే వ్యాపారాలు బాగుంటాయి. సాటివారిలో గౌరవం లభిస్తుంది. నూతన వ్యవహారాలు బాగుంటాయి. వారం ఆఖరులో చికాకులు యేర్పడతాయి. మీ తాలూకు మనుష్యులే మిమ్మల్ని వ్యతిరేకించ గలరు. స్త్రీలకు — కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. బంధువుల నిమిత్తం శ్రమకు గురి కాగలరు.

సింహం :— వృత్తిలో సాటివారి పోటీ పెరుగుతుంది. రాజకీయ వ్యవహారాల్లో శ్రమకలుగుతుంది. ప్రయాణాలు వాయిదా పడతాయి. వారం ఆఖరులో ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. మీ ప్రయత్నాలు సులువుగా నెరవేరతాయి. స్త్రీలకు — ఆరోగ్యం బాగుంటుంది. ఆడంబరం కోసం వ్యయం జరుగు తుంది.

కన్య :— మీ కార్యక్రమాలు నిరాటంకంగా నెరవేరతాయి. మిత్రుల సహాయం లభిస్తుంది. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. వారం ఆఖరులో యెవరితోను వాదప్రతివాదాలు తగవు.

హాయిగా వుండిపోతే వాళ్లరోగం కుదురుతుంది అనే ఆలోచనా వస్తూ వుంటుంది అప్పుడప్పుడూ. కానీ తర్వాత స్థిమితంగా ఆలోచిస్తే గత్యంతరం లేకనే తల్లిదండ్రులు తనసంపాదన కోసం ఆశపడుతూన్నారనేది గుర్తుకొస్తుంది. వూరికి వెళ్ళి వచ్చేస్తూ ఒకసారి యాభై రూపాయిలు తండ్రికిస్తూంటే అవి తీసుకోటానికి ఆయన పడిన బాధ ప్రత్యక్షంగా చూసింది. అందుకే వీలున్నంతవరకూ మనియార్డరు చేసేస్తూవుంటుంది. అలా పంపేప్పుడు బాధకాదు యెంతో తృప్తికల్గుతుంది వైదేహికి. ముసలి వాళ్లయిన తలిదండ్రుల అవసరాలకి ఆదుకుంటున్నాను కదా అని. పెళ్ళి చేసుకోకుండా కొన్నాళ్ళు యిలావుండి కుటుంబానికి సాయపడితే అన్న ఆలోచనా వస్తూ వుంటుంది. ఆఅభిప్రాయాలు ఒకదాన్ని మించి ఒకటి వైదేహిని వుక్కిరిబిక్కిరి చేసేస్తూ చికాకునికల్గిస్తాయి.

"అబ్బబ్బ! వెధవ మనస్సు యెందుకిచ్చావు భగవంతుడా" అని బాధపడి యే సినిమాకో వెళ్లి ఆ బాధని మర్చిపోవటానికి ప్రయత్నిస్తూ రోజులు నెట్టుకొస్తూన్న వైదేహికి మూర్తి స్నేహితం అపురూపంగా కన్పించింది. అందుకే దాన్ని యెంతో పదిలంగా చూసుకుంటూన్న సమయంలో సాధ్వీమణి మాటలు సూదుల్లా గుచ్చుకున్నాయి. ప్రతీకారం తీర్చుకోవాలన్నా మూర్తి అవకాశాన్ని యివ్వకుండా చేశాడు.

వైదేహి పడక కుర్చీలో పడుకుని కళ్లు మూసుకుంది. తలనొప్పి పగిలిపోతోంది. ఫ్లాస్కులో కాఫీ అయినా లేదు. డబ్బు యిచ్చినా తెచ్చిపెట్టే దిక్కులేదు.

ఏం జీవితం నాది. ఈ ప్రపంచంలో నేనేనా. నాలాంటి ఆడపిల్లలు యింకా వున్నారా! వున్నారు ... ఒకరుకాదు వందల్లో వేలల్లో వున్నారు. నీ కంటే కూడా బాధపడే ఆడపిల్లలు వున్నారు" అంతరాత్మ గంటలా మ్రోగుతుంది. వైదేహి యింక తనని తను సంబాళించుకుంటుంది యెలాగో.

"అమ్మగారూ కారియరు" నౌకరు కుర్రాడు కారియరు పట్టుకువచ్చి పిల్చిన తర్వాతగానీ వైదేహి ఈ ప్రపంచంలోకి రాలేదు. లేచి తలుపు తెరిచి 'అరె టైమెంత' అనుకుంటూ వాచీ చూసుకుంది. ఏడున్నర దాటుతోంది.

* * *

నాలుగురోజులు మామూలుగా గడిచిపోయాయి. వైదేహి ఆఫీసునించి వస్తూ మూర్తి గదివైపు చూసి "అరె ఈ బ్రహ్మచారి మహాశయుడు యింకా యిల్లు చేరలేదా! అనుకుంది. కానీ రెండు రోజులైనా వేసిన తాళం అలాగేవుంది. సాధ్వీమణి మరెవరితోనో చెప్తూవుంటే వింది. నాలుగురోజులు శలవు పెట్టి వూరుకి వెళ్లాడనీ ఆదివారం గానీ రారనీ. వైదేహికి మరో రెండు రోజులు గడవటమే కష్టమైపోయింది. మూర్తి రాలేదు. కానీ ఆఫీసు అడ్రెస్‌కి రిజిష్టర్ కవరు ఒకటి వచ్చింది. వణికే చేతులతో అది అందుకుని యెవరి దగ్గర నుంచి అని యిటూ అటూ తిప్పి చూసింది. ఫ్రం అడ్రెస్ మూర్తిది. సంతకం చేసి పోస్టుమేన్‌ని పంపి శలవు పెట్టి రిక్షాలో యెలా చేరిందో వైదేహికి తెలియదు. కాస్త పెద్దదిగావున్న ఆ కవరుని ఆఫీసులోనే విప్పటానికెందుకో భయమన్పించింది. ప్రక్క సీట్లలోవున్న సహవుద్యోగులు కుతూహలంగా చూస్తూన్నది గుర్తించేసరికి మరీ వణుకు వచ్చింది. అందుకే యింటికి వచ్చి కవరు విప్పింది. యేదో చిన్న పాకెట్టూ ఓ వుత్తరం వున్నాయి. ఆతురతగా ఆ వుత్తరం విప్పి గబగబా చదువుకుంటోంది వైదేహి.

వైదేహిగారు, నమస్కారం.

మీరు 'గారు' తీసెయ్యండి అన్నా నేను తియ్యనందుకు కోపగించుకోకండి. నేనిలా హఠాత్తుగా యిక్కడికి వచ్చి తిరిగి వెంటనే అక్కడికి రానిపరిస్థితు లొస్తాయని కలలో కూడా వూహించలేదు. కానీ పరిస్థితి అలా వచ్చేసింది. అసలు నాగురించి మీకు యేం తెలియదు. తెలిస్తే యేవేవో వూహలు అల్లుకోరు, నేను గ్రహించాను వైదేహీ. కానీ వైదేహీ నా జీవితం వడ్డించిన విస్తరి కాదు. సమస్యల మయం. నేనింతవరకూ అవివాహితుడిని అని అనుకుంటున్నారు మీరందరూ. కానీ నాకు పెళ్లిఅయి రెండు సంవత్సరాలైంది. మరెవరో పరాయిపిల్లకాదు. అక్కకూతురునే పెళ్లిచేసుకోవాల్సిన పరిస్థితి వచ్చి హఠాత్తుగా ఆపెళ్లి జరిగిపోయింది, నేనూ అక్కా యిద్దరమే సంతానం మా అమ్మకి. నాన్న చిన్నప్పుడే పోయారు. అక్క మైథిలి పుట్టగానే భర్త వియోగంతో పుట్టిల్లు చేరింది. మైథిలి మాయింట్లో పెరిగినపిల్ల. మామయ్యా అని పిలుస్తూన్న

(34 వ పేజీ చూడండి)

అనవసరమైన సందేహాలు కలుగుతాయి. స్త్రీలకు — దైవకార్యాలు నెరవేరతాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**తుల :—** అన్ని వ్యవహారాల్లోను ఫలితం సామాన్యంగా ఉంటుంది. ప్రయాణాల్లో శ్రమ కలుగు తుంది. ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. వారం ఆఖరులో సామాన్య వ్యవహారాలు లాభిస్తాయి. వ్యాపారంలో ఆదాయం బాగుంటుంది. స్త్రీలకు —ఆరోగ్యం బాగుంటుంది. బంధుమిత్రులను కల్సుకొంటారు.

**వృశ్చికం :—** రాజకీయ వ్యవహారాలు బాగుంటాయి. సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి. మిత్రులకు సహాయం చేస్తారు. వారం ఆఖరులో ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. సామాన్యమైన పనులకు కూడా యెంతో కృషి చేయవలసి వస్తుంది. స్త్రీలకు —ప్రయాణాలోచనలు చేస్తారు.

అనుకూల వార్తలను వింటారు.

**ధనుస్సు :—** మీ ఆలోచనలు ఫలిస్తాయి. రావలసిన డబ్బు అందుతుంది. ప్రయోజనంగల పరిచయాలు యేర్పడతాయి. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. వృత్తిలో పోటీనారి పోటీతగ్గుతుంది. స్త్రీలకు —ఆరోగ్యం బాగుంటుంది. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

**మకరం :—** వ్యాపారంలో ఆదాయం బాగుంటుంది. పోటీవారిలో గౌరవం లభిస్తుంది. నూతన వ్యవహారాలు బాగుంటాయి. వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. ఆర్థిక వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. స్త్రీలకు — కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. విలాస వస్తువులు కొంటారు.

**కుంభం :—** అనవసరమైన శ్రమ కలుగు తుంది. వ్యతిరేకమైన వార్తలను వింటారు. సాహసిక వ్యవహారాల్లో నష్టం రాగలదు. ఆఖరులో మీ కార్యక్రమాలు బాగుంటాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. స్త్రీలకు — ఆరోగ్యం బాగుండదు. వినోదకాలక్షేపాల్లో పాల్గొంటారు.

**మీనం :—** వృత్తి వ్యాపారాలు అనుకూలంగా ఉంటాయి. మిత్రుల సహాయం లభిస్తుంది. నూతన విషయాలను తెల్సుకొంటారు. వారం ఆఖరులో మీ తాలూకు వస్తువులు పోవచ్చు. విద్యా వైజ్ఞానికరంగాల్లో మీ కృషికి ఆటంకాలు వస్తాయి. స్త్రీలకు —కుటుంబ వ్యవహారాల్లో శ్రమ కలుగు తుంది. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

— మహేష్




ప్రొఫెసర్ శివానందం ఆ ఏడు యూనివర్శిటీ వాళ్ళకి ఎక్స్టర్నల్ ఎగ్జామినర్. అంటే అప్పటి వరకూ ఇంటర్నల్ ఎగ్జామినర్స్ వాల్యూ చేసిన పేపర్లు చివరి సారిగా శివానందం చేతిలో పడి చావుదెబ్బలు తింటాయన్నమాట.

"ఎక్స్టర్నల్ ఎగ్జామినర్" అంటే నాకు తెలిసిన అర్థం అది.

శివానందం టేబులు ముందర కుర్చీలో కూర్చుని తల వంచుకొని పేపర్లు దిద్దుకుంటున్నాడు. వరండాలో అలా ఎంతసేపటి నుంచి నిల్చుని వున్నారో వాళ్ళు — ప్రొఫెసర్ శివానందం గమనించనేలేదు. గమనించిన తరువాత కుర్చీలోంచి లేచాడు.

వరమిచ్చే వేల్పు కళ్ళముందు నిలబడినట్టే నిలబడి అదృశ్య మవుతాడేమోనన్న భయం ఆ వచ్చిన వాళ్ళలో వుంది.

చేతులు జోడించారు.

ప్రతినమస్కారం చేస్తూ 'ఎవరు కావాలి?' అన్నాడు శివానందం.

వచ్చినవాళ్ళు మాట్లాడలేదు.

మూగవాళ్ళలా కనిపించారు. మేకపిల్లల్లా ఇద్దరూ ఒదిగొదిగి నిలబడ్డారు. వాళ్ళలో ఒకరికి నలభై ఏళ్ళు మరొకరికి ఇరవై ఏళ్ళు వుంటాయి. ఇద్దరూ భయభక్తులతో నిలబడ్డారు. కాని కుర్రవాడు అప్పుడప్పుడు లేడిలా బెదురుతున్నాడు.

'ఏంకావాలి'

'మావాడి హిస్టరీ పేపరు మీదగ్గరుంది. ఆవిషయం తెలిసి అర్థిద్దామని వచ్చాను.'

శివానందం తన కుడిచేతిలోని ఎర్ర పెన్సిల్ని టేబులుమీదకు విసిరేస్తూ 'అతనేమౌతాడు మీకు' అన్నాడు.

చరిత్రకన్నా లౌకికం బాగా తెలుసాయనకు. రంగులు కలపడం వేయడం రెండూ చాతవు. నలభై ఏళ్ళకే ప్రొఫెసరై పోవడానికి కారణం కూడా అదే... కుర్ర ప్రొఫెసర్ వున్నట్టుండి ఎక్స్టర్నల్ అయ్యాడన్న అదే అసలు రహస్యం.

'మా అబ్బాయి. లేక లేక ఒకడు కలిగాడు'

శివానందం నవ్వుకున్నాడు. ఇవాళ ఇలా మాస్టర్స్‌డిగ్రీ తీసుకుని రేపు డాక్టరేట్ అయ్యేదికూడ అతనే. అప్పుడీ తండ్రే బుజాలెగరవేస్తూ మావాడు యం. ఏ. పిహెచ్‌డి. అంటాడు. ఆశ్చర్యమేం లేదు.

కూర్చోండన్నాడు తీరా వాళ్ళు కూర్చోబోయే సమయానికి తను కుర్చీలో కూర్చున్నట్టే కూర్చుని లేచి నిలబడ్డాడు. ఆ వచ్చిన వాళ్ళ కూర్చోవాలన్న ఆశను చంపుకున్నారు. అది వాళ్ళ ముఖాల్లో ద్యోతకమవుతూనే వుంది.

శివానందం ఏదో మాట్లాడబోయి మరేదో డైలమాలో పడి కాసేపు నిశ్శబ్దంగా వుండిపోయాడు. చాలా మంది చాలాసార్లు తికమకలో పడ్డారు. ఒక్కొ మనిషికి ఒక్కొ రకం డైలమా. కాదని కొట్టేయలేం. ప్రొఫెసర్ శివానందంకూడ ఇప్పుడు అలాంటి డైలమాలోనే పడ్డాడు. ఉపయోగ పడ్తారనుకున్న వాళ్ళ దగ్గర ఆయన ఎప్పుడూ ఒకే ఒక అస్త్రం ప్రయోగిస్తారు. మనకు పనికొస్తాడనుకుంటే ఓ చిరునవ్వు విసరడం, లేకపోతే ముఖం గంభీరంగా చేసుకుని పక్కకు తప్పుకోవడం. ఇలా ముఖంలో అనేక రంగులు మారుస్తాడాయన. మామూలు మనుషులకి రంగుల భాష తెలీదు.

శివానందం ముందు గదిలో మూడు సోఫాలున్నాయి. వాటి మధ్యగా టీపాయివుంది. రకరకాల ఫోటోలు గోడలకు తగిలించున్నాయి. వాటన్నిటినీ చూస్తున్నారేమోనని చాలా సేపటి వరకూ వాళ్ళని మాట్లాడించలేదు ఆయన.

"ఇంతకీ మీ వాడికి ఫస్ట్‌క్లాసివ్వాలంటారు ?"

శివానందం ప్రశ్నకి కార్యార్థులై వచ్చిన ఇద్దరూ చేతులు కట్టుకుని అవునన్నట్టు తలూపారు. మళ్ళీ ఆయనే ఏదో చెప్పబోయి మధ్యలో ఆగారు.

గోడగడియారం గంటలు కొట్టడం మానేసినట్టుంది. లేచివెళ్ళి రేడియో ఆన్ చేశారు. నాలుగు గంటల ముప్ఫయినిముషాలు బి. బి. సి. వాళ్ళిస్తున్న టైమది. గడియారంలో చిన్న ముల్లుని నాలుగు మీదకి పెద్ద ముల్లుని ఆరుమీదకు తోసేసి రేడియో కట్టేశారు ఆయన.

నిజానికి శివానందం మామగారు కూడ కొన్నాళ్ళ క్రితం ఇలాంటి డైలమాలోనే పడాల్సింది. పడే అవకాశాలు కూడ అప్పట్లో ఆయనకు లేకపోలేదు. కాని పడలేదు. పడక పోవడం ఆయన ఖర్మ. అంతకుమించి మరేం కాదు. ప్రొఫెసర్ సత్యనారాయణ పందొమ్మిది వందల ముప్ఫయినాలుగునుంచి చెన్నపట్నంలో వుంటున్నాడు. అప్పటినుంచీ ఇప్పటివరకూ ఒకే అద్దె ఇల్లు. నాలుగు గదులుంటాయి. ముందు వరండా, ఆ వరండాలో ఎత్తుగావున్న అరుగుమీద కూర్చుని తీరిక సమయాల్లో కట

కటాళ్ళోంచి వీధిలోకి చూస్తూంటారాయన. అది ఆయన హాబీ. వాళ్ళ ఇంటికి ఎదురుగా వున్న రోడ్డు వెంట కొంతదూరం పోయాక పక్క సందులోకి మళ్ళి ఆతరువాత కుడిచేతి వైపుకు వెళ్ళి అక్కడనుంచి ఎడమచేతి వైపు మూడో మలుపుకు తిరిగితే ఆయన కాలేజీ. తన ముప్ఫయి ముప్ఫయి ఐదేళ్ళ సర్వీసులో సత్యనారాయణకు బయటి ప్రపంచాన్నిగురించి తెలిసింది బహుతక్కువ. ప్రొద్దున్నే కాలేజీకి వెళ్ళటం సాయంత్రం నాలుగయ్యేటప్పటికి ఇంటికి రావడం ఆ తరువాత ఆయన పేపరు చదువుతూ పడకకుర్చీలో పడుకుంటే పక్కనే కూర్చుని బియ్యంలో మట్టిగడ్డలేరుస్తూ వసంతమ్మ కబుర్లు చెప్పడం—ఇదీ ఆయనకు తెలిసింది. ఇది మినహా ప్రపంచం ఏమైనా ఆయనకు అనవసరం. వసంతమ్మ వయసు యాభై. ఆవిడ ఆయనకు భార్య. వీళ్ళిద్దరికీ పెళ్ళయి అత్తవారింటికెళ్ళినఆడపిల్లకాకుండా రెడీగా పెళ్ళికెదిగిన నలుగురు కూతుళ్ళున్నారు. ఎదుగుతూ ఎదుగుతూవున్న మరో ఆడపిల్ల వుంది. వీళ్ళందరికీ పెళ్ళిళ్ళు ఎలా అవుతాయా అన్నదిగులు వసంతమ్మకుందిగాని ప్రొఫెసర్ గారికి ఇంతవరకూ లేదు. అందుకే మాటల్లో అప్పుడప్పుడు ఆయన్ని వెటకారంగా మందలిస్తూంటుంది వసంతమ్మ 'మీకు చీమ కుట్టినట్టయినా లేదని.' ప్రొఫెసర్‌గారు పరధ్యానంగా 'ఊ' కొడ్తారు.

నిన్న మొన్నటివరకూ ఆయన కేలాంటి భయమూ బెంగాలేవు. కాలేజీయే ఆయన ప్రపంచం. పిల్లలకు పాఠాలు చెప్పడమే తన విధి అనుకునేవాడు. మొదటి తేదీన జీతం తీసుకొచ్చి పెళ్ళాం చేతుల్లో పోస్తే అన్నీ ఆవిడే సర్దుకుపోయేది. అంతకుమించి ఆయన కేం తెలిసేదికాదు. చిన్నప్పటి నుంచీ ఆయనదదే తత్వం. వారాలే చేసుకున్నాడో వస్తులే వున్నాడో ఒకటో తరగతి నుంచి ఆనర్సు వరకూ కష్టపడి చదువుకున్నాడు. తరువాత ఈ ఉద్యోగం వచ్చింది. ఆనర్సు పాసయిన తరువాత సత్యనారాయణకు మా పిల్లనిస్తామంటే మా పిల్లనిస్తామని చాలమంది ఎగబడ్డారు. అప్పరసనే చేసుకోవాలని. ఆయన ఎప్పుడూ అనుకోలేదు. తన కూతురు వసంతను చేసుకోమని ఎవరో వారానికి రెండుపూట్లు భోజనం పెట్టినాయన బ్రతిమాలాడు సరే అని తాళి కట్టాడు. ముప్ఫయ్యేళ్ళ సత్యనారాయణతో సంసారం చేసిన తరువాత ఆ వసంతే ఇప్పుడు వసంతమ్మగా మారింది. భర్తకేనాడు ఆవిడ ఇంతవరకూ ఎదురు చెప్పలేదు. గుంటూరు జరీ చీర కొనిపెట్టినా, గద్వాల్ గళ్ళచీర కొనిపెట్టినా సంతోషంగానే కట్టుకుంది. కాని ఇప్పుడు ఆవిడకు ఒకటేకోరిక — బి. టి. అయి కార్పొరేషన్ స్కూళ్ళల్లో పనిచేస్తున్న ముగ్గురాడపిల్లల్ని ముందు ఏ. పి. హెచ్. డీలకో ఇంజనీర్లకో ఇచ్చేయాలని సత్యనారాయణ అంతా విని మనచేతుల్లో ఏముందే పిచ్చిదాన అని నవ్వి వూరుకునేవాడు.

నవ్వుతూ నవ్వుతూనే రిటైరై పోయాడు. రిటైరైన తరువాతగాని పిల్లలకు పెళ్ళిళ్ళు చెయ్యాలన్న సంగతి గుర్తుకు రాలేదాయనకు. పెద్దల్లుడికి ఉత్తరం రాస్తే రెండో రోజుకే రెండు సంబంధాలేవో సిద్ధంగా వున్నట్టు కబురొచ్చింది. ఒకపిల్లవాడు పశువులడాక్టరు. పశువుల డాక్టరుకి ముప్ఫయి ఐదేళ్ళువస్తున్నా అప్పుడే పెళ్ళేమిటని ముద్దుగా ముద్దుగా గునుస్తున్నాడు. అతని వాటాకి వాళ్ళ స్వగ్రామంలో ఏక్షణంలోనైనా పడిపోవడానికి సిద్ధంగా వున్న పెంకుటింట్లో సగం, అక్కడెక్కడో అదేదో ప్రాజెకు వాళ్ళు దయతలచి నీళ్ళొదిలితే సేద్యం అయ్యే అరెకరం పొలమూ వున్నాయి. పదిహేనువేలైతే ఫర్వాలేదన్నాడు. పిల్లను చూడకుండానే. తీరా చూసిన తరువాత పిల్ల పొడుగ్గా వుందన్నాడు. 'అఫ్‌కోర్స్ సర్దుకోవచ్చులెండి' కాబోయే మామగారితో పళ్ళికిలిస్తూ పరాచికాలాడాడు పశువుల డాక్టరు.

ఆడపడుచు లాంఛనాలు వెండి చెంబు వెండి కంచం పట్టుబట్టలు కాకుండా పన్నెండు వేలైతే మాకేం అభ్యంతరం లేదన్నాడు సత్యనారాయణ రెండో కూతుర్ని చూసిన ఓ పళ్ళడాక్టరుని కన్నతండ్రి. పిల్లవాడిదగ్గర పేషెంట్లు పళ్ళుపీకడానికి పట్కార్లన్నా వున్నాయో లేవో అనుమానమే. కుర్ర డాక్టర్నిద్దర్నీ చూసిన తరువాత సత్యనారాయణకు అరికాలి మంట నెత్తికెక్కింది. పిల్లలకు పెళ్ళిళ్ళయ్యే యోగ్యత ఎప్పుడుంటే అప్పుడవుతాయని వూరుకున్నాడు. కాని వసంతమ్మ పోరుతూనే వుంది — డాక్టర్లే కావాలనేముంది. ఇంజనీర్లయితే మాత్రం ఏమని.

'ఏం ఇంజనీర్లకు డబ్బుచేదా' అన్నాడు కొంచెం కోపంగానే భార్యతో సత్యనారాయణ.

అర్థంకాలేదు ఆవిడకి. అర్థం అయ్యేందుకు ఏముంది కాబట్టి ఇందులో...

వాళ్ళాయన డబ్బు పుచ్చుకుని ఎవరికీ మార్కులు వెయ్యలేదు. పేపర్లవుట్‌చేసి పేవుమెంట్ మీద షాపు పెట్టలేదు. ట్యూషన్ల పేరుతో పైసా సంపాదించలేదు. ఎవరైనా ఏమైనా తెలీలేదనివస్తే సంతోషంగా నాలుగు ముక్కలు చెప్పిపంపేవాడు. లేకపోతే వూరుకునేవాడు.

అదేమని ఎవరైనా అడిగితే సరస్వతిని కూడ అమ్ముకోవడమే అని కోపంగా చూసేవాడు.

ఫలితం దేనిదైనా కానివ్వండి — సత్యనారాయణ నలుగురు కూతుళ్ళకీ పెళ్ళిళ్ళు కాలేదు.

* * *

బండిల్ విప్పి ఒక్కొక్క పేపరే చూస్తున్న ప్రొఫెసర్ శివానందానికి ఆలోచన్లు ఆగడం లేదు. తను చేయబోతున్నది ఎంతవరకూ న్యాయమో తనకు తెలుసు. కాని ఈ ఫలాన వాళ్ళిద్దరూ క్లాసుకోసం ఐదువేలో పదివేలో ఇచ్చేయగలరు. నాలుగు బేరాలిలాంటివి జరిగితే తను నిక్షేపంగా కూతురి పెళ్ళి చేసేయగలడు. లేకపోతే కులము గోత్రము కనుక్కుని క్లాసు ఇచ్చేసి కూతుర్ని ఆకుర్రాడికే నయాపైసా కట్నం లేకుండా కట్టబెడ్తే సరిపోతుంది. పిల్లవాడుకూడ బాగానే వున్నాడు.

శివానందం తన ఆలోచనలకు తనే మురిసిపోయాడు. మరో రోజు వాళ్ళని మళ్ళీ కలవమన్నాడు. క్లాసుకోసం వచ్చిన కుర్రాడ్నీ, కుర్రాడితండ్రికొండెక్కినంత సంబరపడ్డారు. శివానందం ఇంకా ఆలోచిస్తూనే వున్నాడు



# ప్రశ్నావళి

## కె. రామలక్ష్మి

**మంగళ— కాకినాడ.**

మా అమ్మాయిలకి మీ జవాబులు నచ్చుతాయి. ఏభయోపడిలో పడ్డ శ్రీవారికి నచ్చుతాయి. నలభైలో పడ్డ నాకూ పసందుగా వుంటాయి. మీరు అందరినీ ఆనంద పరుస్తున్నారని ఛెప్పడానికి వయస్సులు చెప్పాను ?

వయస్సుతో పని ఏముందీ ? మనసుతోగాని ! సోదరీ. నేను—పిల్లల్లో పిల్లని. పెద్దల్లో పెద్దని. ఆడవాళ్ళమధ్య ఆడదాన్ని. కాని మగవాళ్ళ మధ్య మగవాడిని! అందుకే తిట్టుకుంటూనో, దీవించుకుంటూనో అంతా అభిమానం చూపుతారు— నా పట్ల !

**పి. ఆర్. ఆర్— కడప.**

కిరీటి వాడి అయిన బాణముల కంటే పదునైన పదములతో మా మగవారి కోమల హృదయములను నొప్పింపనేల ? ఇది మీకు సమంజసమేనా !

సిగ్గు సిగ్గు......ఏల నిట్లు బేలవై పల్కెదవు ! మిత్రమా.....ఆడువారాలకించిన నగుబాటు కాదా ?

**కె. వై. ఎస్— పెంట్లవెల్లి.**

మీరిచ్చే తల తిరుగుడు జవాబులు మీపై ఏ అఘాయిత్యానికేనా దారి తీయవచ్చు కావున...

గాజులు తొడిగించుకూర్చోమంటావు అంతేనా ? పిరికివాడు రోజూ చస్తాడు. ధైర్యస్థుడు ఒకసారే చస్తాడు —అని నమ్మకం కలదాన్ని నేను.

**ఎమ్ ఏ ఆర్— విశాఖపట్నం.**

ఆడవారిని ఆరిటాకు తోను. . .

ఆపండి గోల ! ఆడది, అరిటాకు సామెత విని విని నాకు అరిటాకంటే ఎలర్జీపట్టుకుంది. అరిటాకులో అన్నం తిననని శపథం పట్టాను.

**జి. ఆర్. ఎల్ - వైరా.**

మంచిగాగాని, చెడుగా గాని మగవాళ్ళ చర్యకు బలిగాని స్త్రీ ఉత్తమురాలు. . ......

అలా అయితే అలాంటి ఉత్తమురాలెక్కడా వుండరు.

**ఎస్. ఎ. జి-మద్దికెర.**

పురాణాల్లోని యుద్ధాలకు, చరిత్రలోని ప్రపంచ మహాయుద్ధాలకు చాలా మటుకు స్త్రీయే కారణం. స్త్రీ ప్రపంచానికో శాపం. అన్న నా అభిప్రాయంతో మీరు ఏకీభవించ కలరా ?

చచ్చినట్టు ! కాని ఒక్క అనుమానం—ఇలాంటి స్త్రీతో జీవితం పంచుకుందుకు రాజ్యాలని కాలదన్నిన వారు, ప్రపంచాన్ని ఎదిరించినవారు, సర్వస్వాన్ని వదులుకున్నవారు ఉన్నారే . . . అప్పుడు స్త్రీని శాపమనాలా తాపమనాలా ? . . .సంకుచితులు శాపంగా చూస్తే సహృదయులు సర్వంగా ఎంచుతారు.

**కె. ఆర్. బి: కె. ఎన్. బి. కె. జె బి; కె. ఎమ్. ఎస్. క. పి.**

చదువుకు ముగింపు ఏది ?

లేదు.

ఈ జీవితంలో మానవుడికి అతి సులభమైనది అతి కష్టమైనది ఏది ?

కీర్తి.

**ఆర్. ఎల్. ఆర్. —తాణంచెర్ల.**

మీ అభిమాన రచయిత్రి మీరేనా ?

కాదు. రంగనాయకమ్మ.

**ఎస్. కె. బి— పిడుగురాళ్ళ.**

దుర్మార్గులను, దుష్టులను ఏరిపట్టి, విసురుగా వీధిలోకిలాగి, గట్టిగా గళమెత్తి చెపుదామని వుంది . . .

ఎవరికి ? !

**ఎమ్. ఎమ్. ఆర్. పొరుమామిళ్ల.**

కూటికి లేకుంటే కానీ సహాయం చెయ్యదు. బాగా బ్రతుకుతూంటే చూసి వోర్వలేదు. మంచి వారిని అపార్థం చేసుకుని వేలెత్తి చూపుతుంది. అటువంటి కుళ్ళు సమాజానికి ఎందుకు భయపడాలి ?

ఎవరు భయపడు తున్నారు ? మీరా ? మీ పక్కవాళ్ళా ?. . .మానవుడు తన బుద్ధులని ఆకృతి లేని సమాజానికాపాదించి—అక్కసు వెళ్ళకక్కుతాడు. అంతే . . .

**శివ. —యనమలకుదురు.**

మొన్నీ మధ్య ఆడవారిపై తనకున్న అక్కసునంతా వెలిబుచ్చుకున్నాడొకాయన అలాగే కొందరాడువారు కూడా మగవారిని ద్వేషిస్తూ రాస్తారు. ఈ విబేధాలు పోవాలంటే ఏం చేయాలి ?

ఏం చేయాలని అడగడం — అందులోనూ 'శివ' నామం దాల్చిన నువ్వు ! —బాగా లేదు. శివుడు తన భార్యని అర్థశరీరంగా గౌరవించాడు. ముందది అందరూ గుర్తిస్తే —అసలీ గొడవలే వుండవు ! కోరితన అర్థ శరీరాన్ని కించ పరచు కోవడం — ఎవరికి వారికే అవమానం కదా !

**డి. వై. జి-కుచన్‌పల్లి.**

పెళ్ళయిన స్త్రీని గుర్తించకలం. కాని పెళ్ళయిన పురుషుని గుర్తించడం ఎలా ?

అందుకే కదా ! వో పుస్తె పూసో మగాళ్ళు కట్టుకుంటే బాగుంటుందనడం ! . . . ....లేక పోతే చాలా ప్రమాదంగా వుంటూందిట. ఒక్క భార్యనే కాదు పిల్లల్ని కూడా దాచి మళ్ళీ హాయిగా కొత్త పెళ్ళి కొడుకుల్లా పెళ్ళికి సిద్ధం అవుతున్నారట కొందరు ప్రబుద్ధులు !

**ఎ. బి. ఆర్. ఆర్— విజయనగరం.**

రోజూ ఒక అమ్మాయి నన్నుచూసి నవ్వుతూంది...

ఎందుకు నవ్వుతుందో ముందు తెలుసుకునితరవాతే ప్రేమించిందేమో అనుకోండి !

---

**తన ప్లాను ఎంతవరకూ సక్సెస్ అవుతుందా అని.**

ఆ సాయంత్రం క్లబ్‌లో కలిసినప్పుడు పి.హెచ్. డీన్‌ని డీల్ చేసేమూర్తి నిఅడిగాడు— నెక్స్ట్‌ఇయర్ నా కాండిడేటుకో సీటు దయచేయించగలవా అని. సిగార్ వెలిగిస్తూ మూర్తి నవ్వాడు.

'ఏమిటి విషయం'

అప్పుడే బయట పెట్టదలుచుకోలేదు శివానందం.

కాని పక్కనే వున్న మరో కుర్ర ప్రొఫెసర్ శివరావుకి కథ అంతా అర్థమైపోయింది.

'నే చెప్పనా' అన్నాడు

శివానందంకీ శివరావుకి దోస్తీ ఎక్కువ. శివానందం మాస్టర్ ప్లాన్సన్నీ శివరావుకి తెలుసు.

## వ ల

చెప్తాను వినండి.

"డబ్బు సంపాదించడానికి మనకెన్ని సోర్స్ లేద్బ్రియంటారు. మాగ్జిమమ్ రెండు. మూడు. అంతేనా అంతకంటే ఎక్కువా ? కాబట్టి కొడుకుల్ని విదేశాలు పంపాలన్నా, కూతుళ్లకి రిచ్ సంబంధాలు చేయాలన్నా మనకున్న అవకాశాలు బహుతక్కువ. అందుచేత వచ్చిన అవకాశాన్ని జారవిడుచుకోవడం తెలివితక్కువే అవుతుంది. నిన్నగాక మొన్న ప్రొఫెసర్ శివానందం వలలో ఓ మంచి చేప చిక్కుకుంది. ఆ చేపను మార్కెట్ చేస్తే హాట్‌కేకులా ఈరోజు అమ్ముడు పోతుంది. కాని శివానందం ఈ ఛాన్స్‌ని బయట వాడికి ఇవ్వదలుచుకోవడంలేదు. అదీ అసలు విషయం."

మూర్తికింకా ఈ లౌకికం అర్థం కాలేదని శివరావు విడమరిచి చెప్పాడు.

"హిస్టరీలో ఫస్ట్‌క్లాస్ కోసం రెండు రోజుల క్రితం శివానందం దగ్గిరికో కుర్రాడొచ్చాడు. కులము గోత్రము అన్నీ కలిసాయిట. కుర్రవాడు కూడ నా జాగ్నానే వున్నాడు. అతగాడికి ఆయన క్లాసిస్తాడు. మీరు అతనికి రీసెర్చ్ చేయడానికి అవకాశం ఇవ్వండి. సంబంధాన్ని మనవాడు క్షణంలో సెటిల్ చేస్తాడు. శ్రావణంలోనో, ఫాల్గుణంలోనో ఘుమ్మని కూతురికి పెళ్లి చేస్తాడు. పార్టీకొద్దురుగాని. ప్రజంటేషను కూడ సిద్ధం చేసుకోండి."

ఉమాకాంతాన్ని సస్పెండ్ చేశారు.

'ఎప్పుడు ఏం జరుగుతుందో ఎవరి కెరుక' అన్న లోకోక్తి ఒప్పుకోని వాళ్ళు ఈ సారి ఒప్పుకోవాల్సి వస్తుంది.

ఉమాకాంతం చాలా నిక్కచ్చి మనిషి. సూటిగా పోయే మనస్తత్వం. మనిషి పైకి ఎలా వుంటాడో అతని మనసు కూడా అలాగే వుంటుంది. అందుకే అతనంటే అందరికీ, నమ్మకం, గురీను. అతను అందరితోనూ కలుపుగోలుగా తిరుగుతాడు పై అధికారుల క్కూడా ఉమాకాంతం అంటే ప్రత్యేక అభిమానం.

ఉమాకాంతం చెడును చూసి సహించలేడు. ఆవేశపడతాడు. వీలయినంతవరకు చెడును చూడకుండా వుండడానికి ప్రయత్నిస్తాడు. అతను చెడ్డపని ఫలాన్ది చేసాడని ఎవరూ చెప్పలేరు. ఉమాకాంతం లాంటివాడు అటువంటి ఆఫీసులో వుండడానికి తగని మనిషి, ఏ విశ్వమానవ కల్యాణ సంఘంలోనో వుండాల్సిన మనిషి అనుకుంటారు. ఉద్యోగంలో జీతం తప్పించి మరొక పైసా ఆశించని మనిషి. అతను ఆఫీసులో కూర్చుంటే బురద నీళ్ళ మధ్య విచ్చుకున్న తామర పువ్వులా కనిపిస్తాడు.

అటువంటి ఉమాకాంతాన్ని సస్పెండు చేసారనగానే ఆఫీసులో కలకలంబయలుదేరింది.

అతన్ని సస్పెండు చేయడం అన్యాయం అన్నారు చాలామంది. అలా అన్న వాళ్లంతా ఆఫీసు మొత్తం జనాభాని కలుపుకొని మూకుమ్మడిగా ఆఫీసరు గదిలోకి చొరబడ్డారు.

ఆఫీసులో దాదాపు వందమంది జనం. అందరూ ఆఫీసరు గదిలో పట్టక సుమ్మం బయట నిలబడిపోయారు.

అంతమంది జనం గదిలోకి అడుగు పెట్టగానే, రాతిపూట ఒంటరిగా సముద్రంఎదుట నిలబడి ఉవ్వెత్తున లేచిన కెరటాన్ని చూసినంతగా భయపడ్డాడు ఆఫీసరు ఆనందరావు. అందరూ ఆవేశంలో వున్నారని తెలుసు. 'వాళ్లతో జాగ్రత్తగా వ్యవహరించాలి' అనుకున్నాడు.

ఒకళ్ళు ప్రశ్న వేస్తుంటే మరొకళ్ళు నినాదాలు. వేరొకళ్ళు ఆవేశం ప్రదర్శిస్తుంటే ఇంకొకళ్ళు ఆందోళన.

అందరి మొహాల్లోనూ నిరసనభావం వ్యక్తమయింది.

'ఉమాకాంతాన్ని మీ కన్నా ఎక్కువ అభిమానిస్తాను. అతన్ని నా చేతుల్తో సస్పెండు చెయ్యాల్సి వచ్చినందుకు విచారిస్తున్నాను. అతను చేసిన పని మంచిదా చెడ్డదా అన్నది ఇప్పుడు ప్రశ్నగాదు. అతను ఆవేశంలో ఏదో చేసాడు. ఆపరిస్థితుల్లో ఎవరైనా అలాగే చెయ్యవచ్చు ననిపిస్తోంది. ఇకపోతే పోలీసువాళ్ళు అతన్ని అరెస్టు చేశారు. కాబట్టి నేను సస్పెండు చేయాలి సర్వీసు రూల్సు ప్రకారం. నా సీట్లో మీలో ఏ ఒక్కరు కూర్చున్నా అదేపని చేస్తారు. అయినా ఈ విషయం మీకు తెలియదని నేను అనుకొని చెప్పడంలేదు.' ఆనందరావు గంభీరంగా చెప్పాడు.

అందరూ కాస్త చల్లబడ్డారు.

'ఉమాకాంతం త్వరలో ఆఫీసులో మన మధ్య వుండేందుకు నాకు చేతనయినంతవరకు చేస్తాను. ఈ విషయంలో పై అధికారులతో కూడ మాట్లాడతాను' అన్నాడు.

అందరూ థాంక్సు చెప్పారు, ఆనందరావు నవ్వి వూరుకున్నాడు.

రెండు నిముషాల్లో గదిలోని జనమంతా వెళ్లిపోయారు. ఆనందరావు వూపిరి పీల్చుకున్నాడు.

అంతమంది జనం వచ్చినప్పుడు 'ఏమిటీ గొడవ ? మీరంతా బయటికి నడవండి' అంటే ఎంతగొడవ జరిగివుండేదో వూహించుకున్నాడు. తన తెలివికి తనే సంతోషించాడు— గొడవలేకుండా విషయం ముగిసినందుకు.

పులిలా కనిపించే ఆనందరావును కాసేపు పిల్లిని చేసినందుకు ఆఫీసులో వాళ్లంతా సంతోషపడ్డారు.

*    *    *

గిరి నాలుగు రోజులు సెలవుపెట్టి వూరెళ్లాడు వాళ్లావిడను తీసుకొని రావడానికి.

సెలవు అయిన తర్వాత ఆరోజు ఆఫీసు కొచ్చాడు. అతను ఆఫీసుకు రాగానే విన్న విషయం ఉమాకాంతాన్ని సస్పెండు చేయడం.

గిరి ఆశ్చర్యం ప్రకటించలేదు. నొచ్చుకోనూలేదు.

ఉమాకాంతం అందరి అభిమానాన్ని

చూరగొన్నా, గిరి అభిమానాన్ని మాత్రం చూరగొనలేక పోయాడు. దానికి కారణం ఒకటే. ఓ రెండునెల్లక్రితం గిరి ఉమాకాంతాన్ని తన బంధువు కేసులో అనుకూలంగా రిపోర్టు రాయమన్నాడు. దానివల్ల యాభై వేల రూపాయలదాకా ఆ బంధువు లాభం పొందుతాడు. కా నీ ఉమాకాంతం రాయలేనన్నాడు.

పైగా గిరిని మందలించాడు. అప్పట్నించి ఉమాకాంతం అంటే అతనికి గుర్రు.

ఒక మనిషి శతృవయినప్పుడు అతను




ఏంచేసినా తప్పే అనిపిస్తుంది. గిరికి కూడా ఉమాకాంతంది తప్పు అయివుంటుందని అనుకున్నాడు. లేకపోతే వూరికే పోలీసులెందుకు అరెస్టు చేస్తారు ? అని అతని అభిప్రాయం.

గిరికి అసలు విషయం పూర్తిగా వినాలనిపించింది. కాంటీన్‌లో ప్రకాశరావుని దగ్గర కూర్చోపెట్టుకొని 'ఒక్కొక్కళ్ళూ ఒక్కోరకంగా అనుకుంటున్నారు. అసలు జరిగింది జరిగినట్టుగా చెప్పవోయ్' అనడిగాడు.

ప్రకాశరావు ఏ విషయం చెప్పినా ప్రత్యక్ష సాక్షి అయినట్టు చెప్తాడు. అతనిలో ప్రత్యేకత అదే.

'టీ'చప్పరిస్తూ ప్రకాశం మొదలెట్టాడు.

'మొన్న గురువారం రాత్రి సుమారు పదిగంటల వేళ. మన ఉమాకాంతం వాళ్ళావిడా నడిచి వెళుతున్నారు. విద్యానగర్‌లో వాళ్ళావిడ తరఫు బంధువుల ఇంట్లో భోంచేసి యింటికి బయలుదేరారన్నమాట. ఇల్లు దగ్గరేగదా అని నడక సాగించారు. విద్యానగర్ వంతెన దగ్గరకొచ్చారు. ఇద్దరూ మాట్లాడుకుంటూనే నడుస్తున్నారు. బాగా చీకటిగా వుంది ఆ ప్రాంతం. కరెంటు పోయింది. పది దాటేంతర్వాత అటువేపు పెద్ద ట్రాఫిక్ వుండదు. అప్పుడప్పుడూ వచ్చే ఆటోలు, ఒకటి అరా లారీలు, ఒకటి రెండు బస్సులు తప్పించి.

ఇద్దరూ ప్రక్కప్రక్కనే మాట్లాడుకుంటూ నడుస్తున్నారని చెప్పాగదా! ... విద్యానగర్ వంతెన దాటుతుండగా సడెన్‌గా 'టార్చి' వెలుగు ఉమాకాంతం వాళ్ళావిడ మీద పడింది. ఆవిడ వెలుతురును చూడలేక చేతులు మొహానికి కప్పుకుంది. వెలుగు ఆమె మొహంమీద నుండి తప్పుకోలేదు. ఉమాకాంతం 'ఏవిటది ?' అన్నాడు గట్టిగా. జవాబులేదు. నడుస్తున్న ఇద్దరూ ఆగిపోయారు. ఉమాకాంతం కోపంవచ్చి ముందుకెళ్ళాడు. ముగ్గురు మనుషులు కనిపించారు ప్రక్కన రెండు మోటారు సైకిళ్ళు వున్నాయి.

ఉమాకాంతం ముందుకెళ్ళి 'ఎవ్రడావాడూ ?' అని అరిచాడు. టార్చి పట్టుకున్న వాడి చెయ్యి పట్టున్నాడు. రెండో మనిషి ఉమాకాంతాన్ని లాగి పక్కకి తోసాడు. ఉమాకాంతం విసురుగా క్రింద పడిపోయాడు. పెద్ద బలం వున్నమనిషి కాదుగదా !

ఆసమయంలో ఒక ఆటోగానీ, లారీ గానీ, బస్సుగానీ వెళ్ళలేదు. వీళ్ళు గాక మనుషులెవ్వరూ లేరు. పైగా చిక్కటి చీకటి. ఎంతో గట్టిగా అరిస్తేతప్ప ఎవ్వరికీ ఏదీ వినపడదు. వినిపించినా దూరంగా వున్న ఇళ్ళల్లో వాళ్ళకు మాత్రం వినిపిస్తాయి.

క్రింద పడ్డాడని చెప్పాగదూ? అతను లేచే టప్పటికి ఉమాకాంతం వాళ్ళావిడ చెయ్యిని ఒకడు బలంగా పట్టుకున్నాడు. ఒకడు ఆమె నోరును నొక్కేసాడు చేత్తో. ఆమె అటూ ఇటూ పెనుగులాడుతోంది. చేతిలో హాండు బ్యాగ్ జారిపోయింది. ఉమాకాంతం విసురుగా లేచి పరుగెత్తికెళ్ళి బూటుకాలితో ఒకడి డొక్కలో తన్నాడు. ఈ ఫైటింగంతా వంతెన చివర్న జరుగుతోంది. ఉమాకాంతం తన్నగానే ఒకడు రోడ్డుమీద నుండి బంతిలా దొర్లుకుంటూ వంతెన క్రిందకిపడి పోయాడు.

రెండవమనిషి ఉమాకాంతాన్ని బలంగా తోసాడు. హాండు బ్యాగ్ కాళ్ళ కడ్డంపడి ఉమాకాంతం మళ్ళీపడ్డాడు. అతనికి కోపం ఎక్కువయింది. క్రిందపడిలేచాడు. అటూ ఇటూ చూసాడు. అది అంతా కొండప్రాంతం గనక రాళ్ళకుకొదవలేదు. అతనికి రుబ్బురోలంత రాయికనిపించింది. వెనకా ముందూ చూడకుండా ఉమాకాంతం ఆ రాయిని రెండు చేతుల్లోకి తీసుకుని విసిరేసాడు. అదివెళ్ళి ఒకడికాలు మీద పడింది. వాడు 'కెవ్వు'మని అరిచాడు. ఉమాకాంతం ఆగకుండా ఆమెనోరు నొక్కిన వాడి నెత్తిమీద బలంగా అదే రాయి తీసుకొని కొట్టాడు. వాడు చావుకేక పెట్టి క్రిందపడాడు. ఆమెకూడా గట్టిగా అరిచింది.

— రెండుమూడు నిముషాలకు జనం

పోగయ్యారు. వంతెన కిందకు దొల్లుకుంటూ వెళ్ళినవాడు కనిపించలేదు. వాడులేచి వెంటనే పారిపోయివుంటాడు. కేకలువిని. కాలు చితికి వాడు జనం రావడంతో మోటారు సైకిలెక్కి ఎలా స్టార్టు చేశాడో వాడికే తెలియకుండా పారిపోయాడు.

ఆమె నోరు నొక్కిన వాడి తలమాత్రం పచ్చడయింది. వెల్లకిలా రోడ్డుమీద పడ్డాడు. రక్తపుమడుగులో.

పోలీసులొచ్చారు. కొట్టిన మనిషి ఎదురుగుండా వున్నాడు గనక శ్రమలేకుండా అరెస్టు చేశారు.

పోలీసులు అరెస్టుచేశారుగనక మనడిపార్టు మెంటువాళ్ళు వెంటనే సస్పెండుచేశారు.

ప్రకాశం చెప్పడం ముగించాడు. మధ్య మధ్య చప్పరించిన 'టీ' అయిపోయింది.

'వాళ్ళు తాగివున్నారా అప్పుడు?' గిరి ప్రశ్నించాడు.

'బాగా తాగివున్నారట.'

'అయితే ఉమాకాంతం అలా ప్రవర్తించకుండా వుండాల్సింది. టార్చి వెలుగు మీదికి వేసినప్పుడు పట్టించుకోకుండా గబగబానడుచుకుంటూ వెళ్ళిపోవాల్సింది—ఇద్దరూ. అప్పుడు ఇంత గొడవ జరిగివుండేది కాదు. గోటితో పొయ్యే దాన్ని గొడ్డలితో నరికినట్టయింది.

'ఆడమనిషి మీద లైటు వేస్తుంటే చూస్తూ, ఎలా వూరుకుంటారయ్యా!'

'వూరుకోవాలి తప్పదు! అశుద్ధం మీద రాయేస్తే మనమీదే పడుతుంది. వాళ్ళని పట్టించుకొనకపోతే ఇలా ఉద్యోగము పోయేది గాదు, జైల్లో వుండాల్సిన అవసరమూ వుండేదిగాదు. పైగా వాళ్ళు బాగా తాగి వున్నారు. తాగినవాడెదురయితే తప్పించుకొని వెళ్ళాలి గానీ, ఇలా రాద్ధాంతం చేసుకుంటారటయ్యా! పైగానేమో అతన్ని సస్పెండ్

## నీతి

చేస్తే ఆఫీసరుతో అందరూ అన్యాయం అని అరవడమా. అయినా స్టాఫంతా ఏం మొహం పెట్టుకొని ఆఫీసరుదగ్గరికెళ్ళారయ్యా! పోలీసులు అరెస్టు చేసిన వాణ్ని ఉద్యోగంలో ఉంచమని ఏ సర్వీసు రూలు చెబుతుంది?'

ప్రకాశంనోరుతెరుచుకొని వుండిపోయాడు.

గిరి అభిప్రాయం ఆఫీసంతా పాకింది. కొందరు ఉమాకాంతం చేసింది ఒప్పు అన్నారు. మరికొందరు తప్పు అన్నారు. కానీ చాలామంది ఉమాకాంతం సర్దుకు వెళ్ళిపోతే బాగుండేది, వాళ్లతో గొడవ పెట్టుకోకుండా, అనుకున్నారు.

అసోసియేషన్ సెక్రటరీ ముకుందరావు గిరి అభిప్రాయంవిని మండిపడ్డాడు: 'ఏవిటయ్యా గిరీ! అంతమంచి మనిషికి అన్యాయం జరిగితే సానుభూతి చూపించడంపోయి, పైగా ఉమాకాంతం చేసింది తప్పంటావా? ఇంకెప్పుడూ ఇలా అనకు. చూస్తూవుండు. వారం రోజుల్లో ఉమాకాంతం మళ్ళా ఆఫీసులోజేరి పనిచేస్తుంటాడు. తలమీద దెబ్బలు తిన్నవాడు మెల్లగా కోలుకుంటున్నాడు. వాడి స్టేట్‌మెంటు తీసుకుంటే ఇక కేసువుండదు!'

రెండురోజులు గడిచాయి.

ముకుందరావు అసోసియేషన్ తరుపున ఒక అత్యవసర సమావేశం ఏర్పాటుచేశాడు. సభ్యులందర్నీ రమ్మనమని విజ్ఞప్తిచేసాడు.

అందరూ సమావేశమయ్యారు.

ఇప్పుడు మన ఉమాకాంతం కేసు ఎదురు తిరిగింది. దెబ్బతిన్నవాడు చాలా పలుకుబడగలవాళ్ళ చేతిలోని మనిషి. వాళ్ళు ఒక కథ కల్పించి కేసును నడుపుతున్నారు. మన ఉమాకాంతాన్ని రక్షించాలంటే ఒక గట్టి లాయర్ని పెట్టాలి. ఉమాకాంతం పరిస్థితి మనకు తెలుసు. జీతం డబ్బుల్తో కాలంగడిపే మనిషి. ఇప్పుడతనిదగ్గర డబ్బులేదు. అదంతా మనం చందాలు వేసుకుని కేసుని నడపాలి. ఆనందరావుగారుకూడా చాలా గట్టి ప్రయత్నాలు చేస్తున్నారు. ఉమాకాంతం తప్పక విడుదలవుతాడు ... అంటూ ముకుందరావు చెప్పాడు.

ఒక్కొక్కళ్ళు కనీసం ఇరవైరూపాయలు చందా ఇవ్వాలని సూచించారు. కొంతమంది ఇచ్చారు. కొంతమంది యిస్తామన్నారు. కొంతమంది అమ్మో ఇరవై రూపాయలే! అన్నారు.

గిరిమాత్రం ఇవ్వనని కచ్చితంగా చెప్పేశాడు, ముకుందరావు అతన్ని వదిలేసాడు.

సమావేశం ముగిసింతర్వాత ప్రకాశరావు గిరితో అన్నాడు, 'ఇరవైరూపాయలు ఇప్పుడు లేకపోతే తర్వాత యిస్తానని చెప్పొచ్చుగా. అలా తెగేసి యివ్వను అని మాట్లాడితే ఏం బావుంది?'

'బాగుండేదేవిటి? ఉమాకాంతం పెళ్ళి చేసుకొని ఏడేళ్ళయింది. ఇంకా అర్ధరాత్రి పూటలు పెళ్ళాన్ని వెనకేసుకొని షికార్లు కొడితే ఇలాగే వుంటుంది. ఆయన పెళ్ళాం అందగత్తెని వూరందరికీ తెలియాలని అతని వుబలాటం గావును. ఏమైనా అతను చేసిన తెలివితక్కువ పనికి అందరూ చందాలు వేసుకోడం నాకిష్టంలేదు. ఎలాగూ వేసుకుంటున్నారు గాబట్టి ఆ బాధలేవో మీరు పడండి. నేనుమాత్రం దమ్మిడీ యివ్వను. ఊళ్ళోవాళ్ల తల బద్దలుకొడితే అతన్ని రక్షించాలనుకోవడం అవివేకం...'

ఆరోజు తన బంధువు కేసులో సహాయం చెయ్యలేదన్న ఉక్రోషంతో గిరి గబగబా వాగేసాడు.

ప్రకాశం మారు మాట్లాడక వెళ్ళిపోయాడు.

* * *

గిరి బస్సుకోసం నిలబడ్డాడు. భార్య కమల ప్రక్కనే నిలబడింది కాసేపు. ఇక నిల్చోలేక 'షెల్టర్'లోకెళ్ళి కూర్చుంది.

గిరికి కమలకు పెళ్ళయి రెండేళ్ళయింది. మొదటి కాన్పు పోయింది. మళ్ళా ఇప్పుడు నెల తప్పింది. రెండు మూడు రోజులుగా ఒంట్లో బాగుండక పోవడంచేత డాక్టర్ దగ్గరికి తీసుకెళ్లాలనుకున్నాడు గిరి.

గిరికి బాగా తెలిసిన డాక్టరు ఒకాయన

(31వ పేజీ చూడండి)



## సినిమా

[2వ పేజీ తరువాయి]

### అంతా పాత్రధారులం !

విధి ఒక విషవలయం. మనుజుల ఆశలకు, ఆశయాలకు సంకెళ్ళు వేస్తుంది విధి. ఏదైనా విఘ్నం కాకుండా నిర్విఘ్నం కావాలంటే విధి ప్రమేయం అణుమాత్రమైనా వుండకూడదు. ఈ నిజాన్ని కొందరు అంగీకరిస్తారు. మరికొందరు ఖండిస్తారు. విధి ఆడించే వింత నాటకంలో మన మంతా ఆటబొమ్మలం అని నమ్మింది ఓ ఆడ పడుచు. అందుకే తనకు తాళి కట్టబోయేవాడు ఛాందసుడైనా, ఆ చేదును మరచి, మనఃస్ఫూర్తిగా అతనికి అర్ధాంగి అయింది. ఆవిడ అలా చేయడం మూలంగా మరొకరి బ్రతుకు మల్లెపాన్పు అయింది. తనకు అన్యాయం జరిగిందే అని ఆ మగువ నొవ్వ లేదు. బదులుగా మరొకరి పచ్చని జీవితాన్ని చూచి తృప్తిగా మనసులోనే సంతోషపడింది. అలాంటి త్యాగమూర్తి కథే మురళీకృష్ణా ఎంటర్ ప్రైజస్ వారి 'పిచ్చోడి పెళ్లి'' చిత్రం.

జరుగుతుందనుకున్నది జరక్కపోయినపుడు, జరగదు అనుకున్నది జరిగినపుడు ఇలాంటి పాటే ప్రతిధ్వనిస్తుంది చిత్రంలో. ''దేవుడు చేసిన పెళ్లి ఇదే – ఆ దేవుని లీల ఇదే'' అనే ఆర్ద్ర గీతానికి సత్యం స్వరం సమకూర్చగా, రామకృష్ణ, రాజబాబు, విజయనిర్మల, వై. విజయలపై చిత్రీకరించారు దర్శకుడు కె. ఎస్. రెడ్డి.

గుమ్మడి, అల్లు రామలింగయ్య, కొమ్మినేని శేషగిరిరావు, శరత్‌బాబు, సూర్యకాంతం, సుధ, సురభి బాలసరస్వతి, అపర్ణ ముఖ్య పాత్రలను పోషిస్తున్న ఈ చిత్రానికి పినిశెట్టి కథ – మాటలను, బి. యన్. హరిదాస్ ఛాయను, బి. యన్. కృష్ణ కళను, కందస్వామి కూర్పును సమకూరుస్తున్నారు. కె. మురళీకృష్ణ నిర్మిస్తున్న ఈ చిత్రానికి కె. ప్రకాష్‌రెడ్డి నిర్వాహకం చేస్తున్నారు.

### మహేష్ కొత్త చిత్రం !

" అనగనగా ఒక తండ్రి " ని అందించిన [దిన, వారఫలాల రచయిత] మహేష్ తన తదుపరి చిత్రంగా " ముగ్గురు మూర్ఖులు " తీస్తారన్న వార్తను పాఠకులకు తెలిపి యున్నాను.

ప్రస్తుతానికి దానిని ఆయన వాయిదా వేశారు. సెప్టెంబరులో ప్రారంభించాలను కొంటున్నారు.

ఈలోగా ఒక ప్రయోజనాత్మక సాంఘికాన్ని నిర్మించ బూనుకొన్నారు. ఈ చిత్రానికి కథను, ఆయనే వ్రాశారు.

చిత్రంలోని ప్రధాన పాత్రలను నాగభూషణం—సావిత్రి; సూర్యకాంతం – అల్లు రామలింగయ్య; చంద్రమోహన్ – రోజారమణి; గిరిబాబు, మాడా పోషించగలరట. సత్యనారాయణది వైరెటీ వేషమట. నాగభూషణంది ఛాలెంజింగ్ రోల్ అని కథకుడు మహేష్ చెప్పారు. ఏప్రిల్ నుంచి షూటింగ్ వుండగలదట.

# సినిమా

### రవిశంకర్ ఆర్ట్ పిక్చర్స్ !

ఈ సంస్థ రంగుల్లో నిర్మించిన "బలిపీఠం" చిత్రాన్ని చూశాను. ఈ మధ్య విడుదలయిన శోభన్‌బాబు చిత్రాలతో పోల్చిచూస్తే, యిందులోని ఆయన నటన నాచురల్‌గా, అందరినీ ఆకర్షించే విధంగా వున్నదని చెప్పవలసివస్తుంది. దర్శకుడు దాసరి చిత్రాలన్నిటికన్నా, యిది మిన్నగా వచ్చింది. చిత్రం ఆద్యంతం పదునైన సంభాషణలు వున్నాయి.

కన్నీటి పాత్రలకు పెట్టింది పేరుగా వున్న శారదకు, యీ చిత్రంలో భిన్నమైన పాత్ర లభించింది. భర్త మాటను లక్ష్యపెట్టక, స్వేచ్ఛా జీవితాన్ని ఆచరించిన అరుణగా శారద విశిష్టంగా నటించింది.

ఈ చిత్రంలో ఆరు పాటలున్నాయి. "చందమామ రావే, కుశలమా, తెలుగు పాట" అనేడి మూడు పాటలు మంత్రముగ్ధుల్ని చేస్తాయి. చక్రవర్తి సంగీతంలో కొత్త రుచులు అగుపించాయి. ప్రతి పాటకు సన్నివేశ ప్రాధాన్యత వున్నది. పాటలలో తెలుగుదనం, తియ్యదనం వున్నది.

"బలిపీఠం" చిత్రాన్ని చూచిన తరువాత ఎవరు గొప్ప అని తేల్చడం సమస్యగా పరిణమించింది. శోభన్‌బాబుకు మొదటి స్థానం, దాసరికి రెండవ స్థానం, శారదకు మూడవ స్థానం, చక్రవర్తికి తరువాతి స్థానం యివ్వాలి అనిపించింది. రామచవుదరి కృషి ఆద్యంతం కనిపించింది. ఇట్టి మంచి చిత్రాన్ని నిర్మించిన ఏ. శేషగిరిరావు, సునీల్ అభినందనీయులు.

### భలే జయసుధ !

ఏ. వి. కె. ప్రొడక్షన్స్ అధినేతలు కృష్ణారావు, షణ్ముగం "లక్ష్మణరేఖ" పేరిట నిర్మిస్తున్న వుదాత్తమైన చిత్రంలో నవరసాలు నిండిన కవిత పాత్రను జయసుధకు యిచ్చినప్పుడు, అందరూ ఆవహేళన చేశారు. నిర్మాతలకు ఎంత అహంకారము అని అన్నవాళ్లు కూడా వున్నారు.

ఇటీవల ఆ చిత్రం తాలూకు ఏడురీళ్ల రషస్‌ను కొంతమంది విమర్శకులు చూశారు. కవిత పాత్రలో జయసుధ ఘనత వహించినట్లు వెల్లడించారు. కరుణరస పోషణలో జయసుధ ఆరితేరిన జాణ అని నిర్ణయించారు. భలే జయసుధ అన్నారు.

"లక్ష్మణరేఖ" చిత్రానికి గుమ్మడి ధరిస్తున్న జడ్జి పాత్ర జీవనాడి లాంటిది. నమ్మించి, తేనె లొలికే మాటలతో వూరించి, వంచించిన వ్యక్తిగా చంద్రమోహన్ నటిస్తున్నారు. హాస్యం కోసం అల్లు రామలింగయ్య పాత్ర అల్లబడింది. కథానాయకుడి వేషాన్ని మురళీమోహన్ వేస్తున్నారు. మిగతా వాటిని కె. వి. చలం, ఛాయాదేవి, రామదాసు ధరిస్తున్నారు.

సముద్రాల రచన రమణీయంగా, రసాత్మకంగా సాగిన "లక్ష్మణరేఖ" కు సత్యం సంగీత మందేని సహకరిస్తోంది. గౌతమీ వెంకటరత్నం నిర్వహణలో సర్వజన ఆమోదంగా నిర్మింపబడుతున్న యీ చిత్రం, తెలుగు ప్రేక్షకులకు వినూత్న కానుకగా వుంటుంది.



"గాజుల కిష్టయ్య"లో కృష్ణ, జరీనా



### హిందీ చిత్రంలో జయసుధ

ప్రసిద్ధ గాయకుడు కిశోర్‌కుమార్ నిర్మిస్తున్న హిందీ చిత్రంలో జయసుధ హీరోయిన్‌గా నటిస్తున్నది. గత నెల చివరి వారం బొంబాయిలో జయసుధ పాల్గొన్న సన్నివేశాలను, కిశోర్ చిత్రీకరించారు. ఆమెకు అనిల్‌కుమార్ జతగాడు.

బొంబాయిలో జయసుధను అనేకమంది నిర్మాతలు హిందీ చిత్ర రంగంలో స్థిరపడమని కోరారు. ఒక్క రంగానికి మాత్రమే వుండిపోతె ఎలా అని ఆమె వాళ్లకు నచ్చచెప్పింది.

జయసుధకు నాట్యంలో ప్రావీణ్యత వుంది. తెలుగు, తమిళం, హిందీ, ఇంగ్లీషు, కన్నడం భాషలలో చదవడానికి, రాయడానికి, సంభాషించడానికి తెలుసు. స్విమ్మింగ్, హార్స్‌రైడింగులో శిక్షణ పొందియుంది. పరవళ్లు తొక్కే వయసు వుంది. భగవంతుడిచ్చిన సుందరాకృతి వుంది. వీటన్నిటికి మించిన మంచితనం వుంది.

ఇన్ని విద్యలున్న జయసుధకు వచ్చేవన్నీ మంచి రోజులే.

"ఆడవాళ్ళు—అపనిందలు"లో కృష్ణంరాజు, శుభ



"బలిపీఠం"లో ముక్కామల, శోభన్‌బాబు

## శ్రీధర్‌కు హీరో వేషం !

ప్రముఖదర్శకుడు బాపు సృష్టిస్తున్న మరొక సంచలన సాంఘికం "ముత్యాల ముగ్గు" గ్రామీణ యితివృత్తానికి వర్తించేది గాబట్టి, యీ చిత్రం షూటింగు హైదరాబాదు సమీపంలో కొంత, రాజమండ్రి, గోదావరిలో మరికొంత జరిగింది.

ఈ చిత్రంలో ఆరు పాటలు వున్నాయి. గుంటూరు శేషేంద్ర శర్మగారి కలంరుచి యీ చిత్రంలో అగుపిస్తుంది. ఇషాన్‌ఆర్య యీ చిత్రానికి ఛాయాగ్రాహకుడు. యితగాడికి, రాష్ట్రపతి పతకం లభించియుంది.

రచనలో రమణీయ శిల్పాన్ని చూపెట్టే ముళ్ళపూడి, సంగీతంలో మధురిమను చూపెట్టే మహదేవన్ "ముత్యాలముగ్గు"ను మురిపిస్తారు.

ఇచ్చినపాత్రను మెప్పిస్తూ, యిప్పుడిప్పుడే ప్రేక్షకుల దృష్టిని ఆకర్షిస్తున్న శ్రీధర్‌కు హీరో వేషం యివ్వబడింది. బాపుచేతిలో మరింత శోభించ గలడీ శ్రీధర్. హీరోయిన్ పాత్రను సంగీత పోషిస్తున్నది. ఈమె "తీర్పు" చిత్రంలో చక్కగ నటించినట్టు వార్త. సహాయ భూమికలను కాంతారావు, జనార్దనరావు, రావుగోపాలరావు, అల్లు రామలింగయ్య, ముక్కామల, వరప్రసాద్, కాకరాల, సురేష్, సూర్యకాంతం, హలం, జయమాలిని, పూర్ణిమ ధరిస్తున్నారు.

"శ్రీరామాంజనేయయుద్ధం"లో అపూర్వంగా నటించిన కూనలు రాధా—మురళి యిందులోనూ నటిస్తున్నారు. "ముత్యాలముగ్గు" వర్ణచిత్రాన్ని నిర్మిస్తున్న సంస్థ పేరు శ్రీ రామచిత్ర; నిర్మాత పేరు ఎమ్. వి. ఎల్. నరసింహారావు.

## ఆత్రేయ రాసిన "ముద్దు" పాట

ఈమధ్య కిరణ్ ప్రొడక్షన్స్ వారి ఆఫీసుకు వెళ్ళాను. అప్పుడు పి. వి. రమణయ్య ఆత్రేయ రాసిన "ముద్దు" పాటను వినిపించారు.

"ముద్దు"ను గూర్చి మహాకవి ఆత్రేయ రాసిన కవితను పాఠకులు తెలుసుకోవద్దా ?

ప్రేమికులు ముద్దుల వర్షాన్ని కురిపించే గమ్మత్తయిన ఘట్టంకోసం "ముద్దు" మీద ఆత్రేయ అల్లిన అందమైన పాట యిదే.

"ఎన్ని ఎన్ని ఎన్ని ఎన్ని ముద్దులున్నవి
"అన్ని అన్ని నిన్నే కోరి కాచుకున్నవి" అన్నది పల్లవి.

ఆమె: "మూటగట్టి తెచ్చాను కన్నెముద్దులూ
అతను : ఆ ముడి విప్పిచూడని ముద్దు
మూటలూ"

అంటూ ఒకరొకరు కవ్విస్తూ, వలపు తలపులలో విహరిస్తూ క్షణమొక యుగముగా గడిపారు.

ఈ హుషారైన పాటను దర్శకుడు పి. చంద్ర శేఖరరెడ్డి యువజంట భవానీ—చంద్రమోహన్‌లపై చిత్రీకరించారు. "బ్రతుకే ఒక పండుగ" చిత్రంలో యిట్టి కన్నుల పండువైన దృశ్యాలకు కరువుండదు. ఈ చిత్రానికి వై. కిష్టఫర్, పి. హనుమంతరావు నిర్మాతలు.

## "రాజ్యంలో రాబందులు"

క్రయిమ్ చిత్రాలు వచ్చి చాలా రోజులు అయినాయి. దేశంలో క్రయిమ్ పెరుగుతున్న రోజులివి. అన్యాయం, అరాచకం అధికంగా తాండవ మాడుతున్నాయి. నలుగురు దుష్టులు దేశాన్ని, ప్రజలను, బ్యాంకులను, నాశనంచేస్తూ వచ్చారు. ఆ దుర్మార్గుల మద మణచి నీతిని, నిజాయితిని పరిరక్షించాడు ఒక యువకుడు. ఆ యువకుడి పాత్రను రామకృష్ణ, దుష్ట చతుష్టయంగా చంద్రమోహన్, కాకరాల, మోహన్‌బాబు, కొమ్మినేని నటించారు. హీరోకు తోడ్పడిన వనితగా విజయలలిత నటించింది.

ఆద్యంతం హుషారైన సన్నివేశాలతో, హృదయాన్ని స్పృశించే దృశ్యాలతో, గగుర్పాటు కలిగించే ఘట్టాలతో, మధురాతి మధురమైన సంగీతంతో రాకెట్ స్పీడుతో పరుగులుతీసే చిత్రమే "రాజ్యంలో రాబందులు" నిర్మాత కె. త్రినాధరావు. ఈ చిత్రానికి కె. ఎస్. ప్రసాద్ దర్శకుడు.

ఆంధ్ర ప్రేక్షకులకు యీ క్రైం చిత్రం నచ్చే అవకాశాలున్నాయి. విశ్వశాంతి విడుదల.



"పూర్ణమ్మ కథ"లో ఒక సన్నివేశం



"చల్లని తల్లి"లో సుమిత్ర, విజయకాంత్



"చీకటి వెలుగులు"లో రాజబాబు, పద్మప్రియ

# సినిమా

## ఒకే చిత్రంలో తండ్రీ-కొడుకులు!

హిందీలో హిట్ అయిన "కువారా బాప్" చిత్రాన్ని తెలుగులో నిర్మించే హక్కులను చక్రపాణీ ఆర్ట్ పిక్చర్స్‌వారు కొన్నారు. చిత్రానికి "పెళ్లికాని తండ్రి" అని పేరు పెట్టారు. మొహమూద్ పాత్రకు ప్రముఖ హాస్య నటుడు పద్మనాభాన్ని, మొహమూద్ కొడుకు పాత్రకు పద్మనాభం పుత్రుడు బి. మురళీని ఎన్నుకున్నారు. ఫిబ్రవరి మొదటి వారంలో పాటల రికార్డింగ్‌ను, ఫిబ్రవరి ఆఖరి వారంలో హైదరాబాద్ లాంటి ముఖ్య ప్రాంతాల్లో షూటింగ్ కార్యక్రమాన్ని జరపదలచారు.

కొంతమంది ప్రముఖ తారలు ఈ చిత్రంలో అతిథి నటులుగా నటించడం ఒక ప్రత్యేకత. ఇక కథ విషయానికొస్తే, గుడిముందు ఎవరో వదిలేసి వెళ్లిన పిల్లవాడ్ని చేరదీసి, వాడి బ్రతుకు బాగు కోసం ప్రేమించిన పడతిని పరిణయం కూడా చేసుకోకుండా, తన పూర్ణ జీవితాన్ని ఆ పసివాడి కోసం త్యాగం చేసిన ఒక రిక్షావాలా కన్నీటి గాథయే "పెళ్లికాని తండ్రి". ప్రఖ్యాత తమిళ నటి మనోరమ పై చిత్రంలో గెస్టుగా నటిస్తుంది.

పి. వీరేశం, పి. లక్ష్మారెడ్డి నిర్మిస్తున్న ఈ చిత్రంలో కాంచన, రమాప్రభ, గిరిబాబు, బాలకృష్ణ, పొట్టి ప్రసాద్, శరత్‌బాబు, ఎం. రంగారావు, టి. వి రావు ప్రధాన పాత్రలను పోషిస్తున్నారు. పద్మనాభం సమర్పిస్తున్న ఈ చిత్రానికి వీటూరి సంభాషణలను, శంకర్ సంగీతాన్ని, బాలు కెమెరాను, సురేంద్రనాథరెడ్డి కూర్పును, అనంతరామ్ కళను, నిర్వహిస్తున్నారు. రంగుల్లో నిర్మింపబడుతున్న ఈ చిత్రానికి స్క్రీన్‌ప్లే, దర్శకత్వం చేసే బాధ్యతలను పద్మనాభం స్వీకరించారు.

## ఎడిటర్‌కు దర్శకత్వం

చిత్ర నిర్మాణంలో ఎడిటరు నిర్వహించేది పెద్దపాత్ర. ఆ శాఖలో విశేష అనుభవం గడించిన జగదీష్‌కు దర్శకత్వం యివ్వబడింది.

విజయలక్ష్మి ఇంటర్నేషనల్ నిర్మిస్తున్న "నీడలు-నిజాలు" చిత్రానికి జగదీష్ కూర్పుతోబాటు దర్శకత్వాన్నికూడా నిర్వహిస్తున్నారు ఈ చిత్రానికి మేడూరి రాజబాబు, జరుగుల రామారావు నిర్మాతలు.

మార్చినుండి షూటింగు ఆరంభమయ్యే యీ చిత్రంయొక్క మొదటిపాట రికార్డింగు డిశంబరు 30న జరిగింది. దాశరథి రాసిన "నా గజ్జెలు ఘల్లన్నాయి; మీ గుండెలు ఝల్లన్నాయి; నా అందెల సందడిలోన; మీ అందరి కథలున్నాయి." అనెడి పాటను సుశీల మధుర మనోహరంగా పాడింది. జె.వి.రాఘవులు సంగీతదర్శకుడు.

"నీడలు – నిజాలు" కథను రాసిన దశరథ రామిరెడ్డి, మాటలనుకూడా రచించారు. ప్రముఖ రంగస్థల నటుడు, 'నాటకావతంస' బిరుదాంకితుడు అగు ఏ. శివరామరెడ్డి మాటల పర్యవేక్షణ చేస్తారు. ఈ చిత్ర నిర్మాణ నిర్వహణను కిషన్ మంత్రి, మేడూరి సీతయ్యనాయుడు; ఛాయాగ్రహణాన్ని పుష్పాల గోపీకృష్ణ నిర్వహిస్తున్నారు.

కథానాయికపాత్రను, మదరాసు ఫిలిమ్ ఇన్‌స్టిట్యూట్ విద్యార్థిని గీత మాలినికి యిచ్చినట్టు, దర్శకుడు జగదీష్ చెప్పారు.

కూర్పులో నేర్పును చూపెడుతున్న, జగదీష్‌కు దర్శకత్వంలో జయం కలగాలి.

## "నవ్వుతూ బ్రతకాలి!"

నరేంద్ర ప్రొడక్షన్స్ నిర్మిస్తున్న చిత్రం పేరిది. ఈ చిత్రానికి పి. చంద్రశేఖరరెడ్డి దర్శకుడు. కథను ఎన్. లక్ష్మీదేవి రాశారు. మాటలను పినిశెట్టి రచించారు.

"జీవితం క్షణ భంగురం. కష్టసుఖాలను సమదృష్టితో చూడాలి. ఉన్న నాలుగు నాళ్లు నవ్వుతూ బ్రతకడం నేర్చుకోవాలి" అనెడి అంశపై అల్లబడిన ఈ కథను చిత్రంగా నిర్మిస్తున్న వ్యక్తులు ముగ్గురు. [కె. టి. శ్రీనివాసరావు, పి. సూర్యనారాయణరావు, ఎమ్. డి. వసుద్దీన్.]

నల్లంరెడ్డి ప్రసాద్ సమర్పించు "నవ్వుతూ బ్రతకాలి" చిత్రంలో అంజలీదేవి, సత్యనారాయణ, రంగనాథ్, కాంచన, రమాప్రభ, కె. వి. చలం, చంద్రమోహన్, సత్యప్రియ, రావికొండలరావు, ముక్కామల ముఖ్య పాత్రధారులు.

మార్చి 16 నుంచి 25 వరకు మొదటి షెడ్యూలు జరుగుతుంది. ఈ చిత్రానికి జి. కె. వెంకటేష్ సంగీతాన్ని, సోమనాథ్ కళను, మల్లి యిరానీ ఛాయను నిర్వహిస్తున్నారు.

"జీవన జ్యోతి"లో శోభన్‌బాబు, వాణిశ్రీ





"రాజ్యంలో రాబందులు"లో
కొమ్మినేని శేషగిరిరావు, కాకరాల, మోహన్‌బాబు

## హనీమూన్ అంటే తేనెచంద్రుడా!

మధుకు కోర్టు సెలవులొచ్చాయి. తన భార్య కనకాన్ని తీసుకుని హనీమూన్ కెళ్దామని బయలుదేరాడు. కనకం ఒట్టి అమాయకురాలు. అందుకే రైలు దిగంగానే కూలిని పట్టుకుని దొంగ అంది. హోటల్‌ను పట్టుకుని సత్రం అంది. వెర్రిబాగుల దానిలా ఎలుగుబంటిని చూచి జాంబవంతుడంది. కనకం వింత చేష్టలు చూచి మధుకు చిరాకు పుట్టింది. మధు చిరాకు కనకానికి ఏడుపు తెప్పించింది. చేసింది చాలక ఏడుపుకూడానా అంటాడు మధు. నువ్విలా విసుక్కుంటావని తెలిస్తే అసలు వచ్చుండేదాన్నే కాదు. నువ్వేం చూపించక్కరలేదు. అదేదో తేనెచంద్రుడన్నావుగా అది చూపించూ అంది కనకం అమాయకంగా. తేనెచంద్రుడా! వాడెవడు? అన్నాడు ప్రశ్నార్థకంగా మధు. నాకు తెలియదనుకున్నావా! బుచ్చిబాబు చెప్పాడులే. హనీమూన్ అంటే తేనెచంద్రుడటగా అంది కనకం. అందుకు మధు హనీమూన్ అంటే తేనెచంద్రుడు కాదు అంటూ భార్యను కౌగిట్లో బంధించి చెవులో ఏదో చెప్తాడు. మధుగా కృష్ణ, కనకంగా విజయనిర్మల నటించారు.

ఈ హాస్యభరిత సన్నివేశం రవిరాజ్ కంబైన్స్ నిర్మిస్తున్న "సంతానం–సౌభాగ్యం" చిత్రంలో కన్పిస్తుంది. కె. వెంకట్రామరెడ్డి సమర్పిస్తూ, కేశన జయరాం నిర్మిస్తున్న ఈ చిత్రానికి డి. ఎస్. ప్రకాశరావు దర్శకుడు.

— శ్రీనివాస్

## ★ ప్రారంభం! ★

**సూర్యుడు పడమటి దిక్కున వాల్తువున్నాడు. ఆ దిక్కున ఆకాశంలో మబ్బుకన్నెలు సిగ్గుతో మొహాలు ఎర్రంగా చేసుకున్నాయి. పశువులు దుమ్ములేపుతూ అప్పడే యిళ్లకి చేరుకుంటున్నాయి. ఆ సమయంలో రాముడుపాలెం బస్టాండు దగ్గర బస్సు ఆగింది.**

అందులోంచి దిగి దుమ్ము కొట్టుకున్న మొహాన్ని కర్చీఫ్‌తో తుడుచుకొంటూ, బ్రీఫ్ కేసు పట్టుకొని చకచకా వూళ్లోకి నడిచాడు ఒక యువకుడు. అతను పాంటూ, బుష్‌షర్టూ వేసుకొన్నాడు. క్రాపు గజిబిజిగా మొహంమీదికి పడుతూవుంది. సన్నగా బక్కపలచగా వున్నాడు. గాలికి ఎగిరిపోయేలా వున్నాడు. అతను చకచకా నడుచుకొంటూ, రామాలయం దగ్గర మలుపు తిరిగి గుర్రాజు బజారులో చొరబడ్డాడు ఆ బజార్లో నాలుగో యిల్లు పెద్ద డాబా. ఆ డాబా ముందు కొబ్బరిచెట్లు వున్నాయి కొబ్బరిచెట్ల ప్రక్కగా రకరకాల పూలచెట్లు వున్నాయి. వెనక పెరట్లో బత్తాయిచెట్టు ఉంది. దాని కవతలగా నారింజ, సపోటా, దానిమ్మచెట్లు వున్నాయి. వాటిప్రక్కగా కూరగాయలచెట్లూ, ఆ ప్రక్కనే కరివేపాకుచెట్లూ వున్నాయి. అప్పటిదాకా ఆ పాదుల మధ్య ఏదో పని చేసుకుంటూవున్న కాంతమ్మ చేతులు కడుక్కొని అప్పుడే డాబా ముందుకి వచ్చింది. డాబా ముందు సిమెంటు చప్టా మీద కుర్చీలో కూర్చుని చుట్టపొగ పీలుస్తూ తీరిగ్గా ఆవాల్టి పేపరు చూస్తున్నాడు భూషయ్య.

భూషయ్య కాంతమ్మ భర్త. నలభై ఎకరాల మాగాణికి సొంతదారు. ఆపైన ముప్పయిఎకరాల మెట్టపొలం వుంది. మాగాణిలో వరీ, మెట్టలో ప్రత్తి, మిరప, వేరుశనగ మొదలైన పంటలు పండిస్తూ మంచి రైతుగా పేరూ, డబ్బూ గడించాడు భూషయ్య.

అంతా స్వార్జితం. అందుకే భూషయ్యని చూసి అయినవాళ్లూ కానివాళ్లూ భయమూ గౌరవమూ కన్పరుస్తారు. కనుక ఈమధ్యన అతనిలో అహం సమృద్ధిగా పెరిగింది.

గేటు దగ్గర నుంచుని పెద్దపులిని చూసి నిలబడినట్టు, ఆగిపోయిన ఆ యువకుడు కాంతమ్మని చూసి 'అత్తయ్యోయి వచ్చేసాను' అని అరిచాడు. ఆ మాటకి తలెత్తి అటు చూసిన కాంతమ్మ మొహం విప్పారింది. అప్పడే ఆ సవ్వడికి అటు మొహంతిప్పి చూసిన భూషయ్య మొహం ముడుచుకుంది.

"రా. రా." అంటూ ఆహ్వానించింది కాంతమ్మ. పిలుస్తూనే లోపల్నుంచి కుర్చీ తెచ్చి వేసింది. చెంబుతో నీళ్లు తెచ్చియిస్తూ "మా బోసుబాబండీ. గుర్తుపట్టలా ?" అంది భూషయ్యని.

"ఏ బోసు ? నేతాజీ సుభాస్‌చంద్రబోసా ?" అన్నాడు భూషయ్య మీసాల్చాటునుంచి నవ్వుతూ. ఆ మాటలకి మొహం కడుక్కొంటున్న బోసుబాబు మొహం ఎర్రబడింది. మొహాన్ని తుడుచుకొనే నెపంమీద తువాలుతో కప్పుకొన్నాడు.

"అవునండీ. మా అన్నయ్యగారబ్బాయి." అంది కాంతమ్మ, మంచినీళ్లు తెచ్చియిస్తూ.

"ఏ అన్నయ్యగారబ్బాయి ?" తెలీనట్టు అడిగేడు భూషయ్య.

"అదేనండీ. ఖమ్మంలో వుంటంలా, రాజన్నయ్య. వాళ్లబ్బాయి."

భూషయ్య తలూపి అన్నాడు, "ఓహో !"

"అంతా బావున్నార్రా ?" అంది కాంతమ్మ. అవునన్నట్టు తలాడించాడు బోసుబాబు.

"నువ్వు కూర్చుని మామయ్యతో కబుర్లు చెప్తువుండరా. నేను వెళ్లి కాఫీ తెస్తాను" అంటూ లోపలికి వెళ్లింది కాంతమ్మ, కాళీఐన మంచినీళ్ల గ్లాసు తీసుకుని.

బోసుబాబు బెరుకు బెరుగ్గా కుర్చీలో కూర్చున్నాడు.

భూషయ్య గంభీరంగా పైకి చూస్తూ చుట్టపొగ ధారాళంగా వదల్టంలో మునిగిపోయాడు. ముళ్లమీద కూర్చున్నట్టు వుంది బోసుబాబుకి. బలవంతంమీద వచ్చిపడ్డాడిక్కడికి. అందుకు కారకులయిన తండ్రి రాజారావుని, తల్లి నీలమ్మని లోలోపలే తెగతిట్టుకున్నాడు బోసుబాబు. 'నేను వెళ్లను మొర్రో' అంటే 'కాదు వెళ్లిరారా బాబు ఒక్కసారంటే ఒక్కసారి వెళ్లిరా. నీకెందుకు ? మిగతా విషయం నేను చూసుకుంటానుగా.' అంటు బస్సు ఎక్కించాడు తండ్రి. 'మంజుల బంగారు బొమ్మరా. కొండంత ఆస్తి. హంగూ ! యిటువంటి విషయాల్లో ధైర్యవూ తెగింపూ అవసరం. వెళ్లిరమ్మన్నప్పుడు ఒకసారి వెళ్లిరారాదా ?" అంటు చెవి నిల్లుకట్టుకొని పోరింది తల్లి నీలమ్మ.

తనకి యిష్టంలేకపోయినా వచ్చిపడ్డాడు, బోసుబాబు.

మొదట్నుంచీ భూషయ్యంటె బోసుబాబుకి బెరుకు. ఆయన ధోరణికి అసహ్యం. తమకే వుందన్న ఆయన గర్వానికి, అహంభావ ప్రవర్తనకీ ఆయనంటే కోపం. పేదవాడి కోపం పెదవికి చేటు గదా అని తనే దూరంగా పోవటాన్కి ప్రయత్నిస్తాడు బోసుబాబు. లేకపోతే మంజుల అందాలరాణి అని తెలీకాకాదు; ఆమెని లవ్వు చెయ్యకా కాదు. ఒక్క చూపు చాలు. కాకపోతే ఒక దరహాసం చాలు ఆ లవ్వు చిత్తు చిత్తయి దూదిపింజలుగా ఎగిరిపోవటాన్కి. అందుకే తన లవ్వుకి బరువులేదని తెలిసి



దూరంగా పారిపోవటాన్కి ప్రయత్నించాడు, బోసుబాబు. తలిదండ్రులే పట్టుబట్టి, కాలు చేతులు కట్టి బ్రతిమాలి యిక్కడికి తోలేరు.

హఠాత్తుగా భూషయ్య మౌనాన్ని భంగంచేసి సకిలించేడు. ఉన్నవాడి సకిలింతలకి ఎన్నో అర్థాలు !

"ఆఁ! ఇప్పుడు నువ్వు ఏం చేస్తున్నావు ?" అని అడిగాడు భూషయ్య.

ఉలికిపాటు అణచుకొని చెప్పాడు బోసుబాబు.



# వంగలవల

పాలడుగు వెంకటేశ్వరరావు

"ఎం. ఏ. చేస్తున్నానండి."

"ఆ తర్వాత రోడ్లవెంట తిరగాలి కాబోలు." మీసాల్చాటునుంచి నవ్వాడు భూషయ్య.

ఆ మాటకి బోసుబాబు సిగ్గుపడ్డాడు. అస హ్యంతో ముడుచుకుపోయాడు.

"మీ నాన్న ఏం చేస్తున్నాడు ?"

"ఆదేనండి. ఖమ్మంలో లెక్చరరుగానే వున్నారు."

"అది సరేలేవోయి. ఏమన్నా సంపాదించాడా? అని !"

బోసుబాబు తల వంచుకున్నాడు. ఈ ఓల్డ్ మాన్ కిక మాట్లాట్టం రాదా ? అనుకున్నాడు. చురకత్తుల్లాంటి మాటల్తో గుండెల్ని కోస్తున్నాడే అని బాధపడ్డాడు.

"బ్రతకలేక బడిపంతులు అన్నారు. ఏం సంపాదనలే ? రెండుపూట్లా తిండివెళ్తే అదే పదివేలు. వ్వూ" అంటు మూలిగాడు భూషయ్య. ఆ వెంటనే మరలా అందుకున్నాడు. "నలభై ఎకరాల మాగాణి. ముప్పయిఎకరాల మెట్ట. పాడీపంటా. లక్షిందేవిని నా ఇంటో కట్టేసాను. అన్నీ అమ్మాయి ఒక్కదానికే. ఇంకా యేమ రున్నారు ?"

తల వంచుకుని విన్నాడు బోసుబాబు.

## రంగుల వల

"అమ్మాయి, కారు కావాలంటు వుంది. ఎంబాసిడరు కావాలా? ఫియట్ కావాలా అంటే స్నేహితుల్ని అడిగి చెపుతానంది. అందుకే ఆలస్యం. లేకుంటే ఇప్పుడు కారు చూసివుండేవాడివి, మా యింటిముందు. ఈ సంవత్సరం ప్రత్తి వేసాను. లక్షన్నరన్నా రావాలి." అంటూ చెప్పకుపోతూ ఆగాడు భూషయ్య. ఒకసారి దగ్గి మరల అన్నాడు.

"చెరువునిండా నీరుంటే కప్పలు పదివేలు చేరునన్నారు. అట్లాగే ఈ చుట్టాలున్నూ. మీ అత్త ఒక పిచ్చిమాలోకం. అయినా తనదేం పెత్తనం లేదులే. అంతా నేనూ అమ్మాయి చూసుకుంటాము. నువ్వు ఎం. ఏ. అయినాక వుద్యోగం గురించి ఏమయినా సాయం కావాలంటే రా. చూస్తాలే. సిగ్గుపడకుసుమా!"

బోసుబాబు క్రుంగిపోయాడు.

"ఈ పూట వుంటావా? లేక వెళ్లిపోతావా? వెళ్లాలంటే యింకో అరగంటలో బస్సుందనుకో. అది పట్టుకొని బెజవాడ చేరితే ఏదో ఒక బండిలో ఖమ్మం చేరవచ్చు. వుండాలనుకుంటే వుండచ్చనుకో. వెళ్లాలనుకుంటే వెళ్లవచ్చుకూడా." అన్నాడు భూషయ్య. ఆ లౌకికం పుండుపొడిచి కారం రాసినట్లనిపించింది బోసుబాబుకి. బోసుబాబు చివ్వున లేచాడు, బుస్సున పొంగిన కోపాన్ని అణచుకుంటూ.

"వెళ్తాను మామయ్యా. పనుంది. చాన్నాళ్లయింది, అత్తయ్యని చూసిపోదామని వచ్చాను. చూసాను. పని అయింది. వెళ్తాను మామయ్యా." బోసుబాబు కళ్లలో నీళ్లు పొంగాయి.

"మంచిదోయి. వెళ్లిరా. మీ నాన్నని ఒకసారి వచ్చిపొమ్మను." అన్నాడు భూషయ్య నవ్వి.

"అల్లాగే." బ్రీఫ్‌కేసు అందుకుని గబగబా నడిచాడు బోసుబాబు. అలాబోసుబాబు గేటు దాటగానే కాఫీకప్పుతో వచ్చింది కాంతమ్మ లోపల్నించి.

"ఏడీ బోసుబాబు?"

"వెళ్లిపోయాడు."

"అయ్యో, అదేమిటి? మీరెల్లా చూస్తూ వూరుకొన్నారు?"

"నన్నే చెప్పమంటావు? పోతాను మొర్రో అంటే కాళ్లు కట్టేయమన్నావా? ఈ కాలపు కుర్రకారు సంగతి నీకూ నాకూ ఏం తెల్సు? అతను ఎందుకు వచ్చాడో మరల అర్ధాంతరంగా ఎందుకు వెళిపోయేడో? ఆ వేషం? ఆ వ్యవహారం! ఏవీ లేని ఆకు ఎగిరెగిరి పడుతుందని." అంటూ శాపనార్ధాలు పెడ్తూ. ఆమె చేతిలోని కాఫీకప్పు అందుకున్నాడు భూషయ్య. కాంతమ్మ వురిమిచూసి లోపలికి వెళ్లింది.

## 2

అర్ధరాత్రి తలుపు చప్పుడుకి లేచి లైటు వేసింది నీలమ్మ. రాజారావు లుంగీ సర్దుకుని వెళ్లి తలుపు తీసేడు. బ్రీఫ్‌కేసు పట్టుకొని దూకుడుగా 'వూండెడ్ సోల్జర్'లా లోపలికి వచ్చాడు బోసుబాబు, చిరాగ్గా, కోపంగా.

"అదేం(టా ? రాముడుపాలెం వెళ్లలా ?" అంది నీలమ్మ.

"వెళ్లేను."

"వాళ్ళు లేరా ? అప్పుడే వచ్చేవేమి ?"

"వున్నార్లె. వచ్చేసేను."

"అదే, ఎందుకనీ అంట ?"

"ఆ భూషయ్యగార్కి 'గిత్తదూడ' నచ్చలేదు. ఆయన 'ఆవుదూడ'కి వెనకాల ఇంత'లప్ప' ఉందట. కనుక బరువు చాలదు. 'జోడీ కుదరదు ఫో' అని తెగేసి చెప్పాడు. చురకత్తుల్ని గుండెల్లో దించి తరిమికొట్టాడు."

"అవేం మాటలురా ? !"

"వున్న మాట్లేలే. నేను రేపే వాల్తేరు పోతున్నాను."

"ఇంకా సెలవున్నప్పుడు అదేంరా ? అసలు ఏం జరిగిందో చెప్పరాదా ?" రాజారావు అడిగేడు.

"ఏం చెప్పను ? నాన్నా. నా దార్ని నన్ను బ్రతకనీక అసలు నన్నీ లంపటంలోకి ఎందుకు త్రోసావు ? ఆయన నానా మాటలు అని మొహాన్న యిన్ని పేడనీళ్లు కొట్టి తోలేసాడు. వెళ్లినందుకు తగిన శాస్తి అయింది."

"అట్లాగేం ? అయినా అవేం మాట(లా ? ఆయన తొందర మనిషి ? మనవూ తొందరపడితే ఎలా ?"

"అంటే ఆయన ఏమన్నా నోర్మూసుకు పడమనా ? నావల్లకాదు. అసలు నాకు పెళ్లి పెటాకులు వద్దేవద్దు. కాస్త నా గోడుకూడ మీరు వినాలి."

"మేనరికం కాదంటే ఎలారా ?"

"నీకూ, నీ మేనరికానికి నమస్కారం. ఊరికే గాలిమేడలు కట్టవద్దు. రంగుల వలలు అల్లవద్దు. వింటున్నావా ? ఆ భూషయ్య వచ్చి బ్రతిమాలి కాళ్లు కడిగి కన్యాదానం చేస్తానన్నా నేను చచ్చినా ఒప్పకోను. వాళ్లకుంటే వుండుగాక. మనకి పెట్టరుగదా ! అంతంత మాటలు అంటారా ?" అంటూ కుండ బ్రద్దలుకొట్టి మునుగుతన్నేడు బోసుబాబు.

ఆ రాత్రంతా నీలమ్మా రాజారావూ గుంపు చింపులు పడ్తూనే వున్నారు.

తెల్లవారుఝామున లేచి సూట్కేసూ బెడ్డింగూ పట్టుకొని వాల్తేరు వెళ్లిపోయేడు బోసుబాబు, ఎంత మొత్తుకున్నా వినకుండా.

మర్నాడే కాలేజీకి సెలవుపెట్టి ఊరికి బయల్దేరాడు రాజారావు.

అసలు ఏం జరిగిందో తెల్సుకోవాలన్న తలంపు రాజారావుకి కాలు నిలవనీయలేదు. ఏ విషయాన్నీ ఒక పట్టాన వదిలిపెట్టే తత్వంకాదు రాజారావుది.

### 3

రాజారావు కాలు చేతులు కడుక్కుంటూ నవ్వుతూ కాంతమ్మతో కబుర్లు చెప్తున్నాడు. తుళ్లుతూ తూలుతూ వచ్చింది మంజుల, బయట్నుంచి.

"ఎవరూ మన మంజులే ! చూస్తు చూస్తు వుండగానే ఎంతగా ఎదిగిపోయింది. బంగారపు బొమ్మలా అయింది." అంటు ఆశ్చర్యం వెలిబుచ్చాడు, రాజారావు.

మంజుల సిగ్గు పడింది 'అంత సిగ్గు ఎందుకమ్మా మంజుతల్లీ. ఏం చదువుతున్నావు ? ఏలూర్నించి ఎప్పుడు దిగేవు సెలవులకి ?"

"నిన్నే. బి. ఏ." అంది గొప్పగా.

"వాతల్లే. అంతవరకూ వచ్చేవన్నమాట." అన్న ప్రశంసకి పొంగిపోతూ సిగ్గుపడి లోపల్కి తుర్రుమంది మంజుల. పచ్చని ఒంటికి ఎర్రరంగు పరికిణే, ఓణీ. మెడలోని సన్నని బంగారుగొలుసూ నవ్వి రాజారావు ఉక్కిరిబిక్కిరయి రెప్పలు అల్లలాడించాడు. తన తమ్ముడు మేనగోడలుతో సరాచికాలాడ్తూవుంటే చూస్తూ వినోదించింది కాంతమ్మ.

"మంజుతల్లికి మరి సంబంధాలు ఏవన్నా చూస్తున్నారా అక్కా ?"

"ఇంకా ఎక్కడా ? వాళ్ల నాయనకి యింకా యిది పసిపిల్లకిందే లెక్కకదా ?"

"అయినా — పెరట్లో తులసిచెట్టు పెట్టుకుని ఆకుకోసం వూరంతా తిరిగినట్లు మన మంజుతల్లిని మా బోసుబాబుకి యివ్వరాదా అక్కా ?" అని నవ్వాడు రాజారావు. బాణం వదిలాడు. ఫలితం కోసం ఆత్రంగా చూసాడు. ఓపిక తెచ్చుకొని మరీ చూసాడు రాజారావు. కాని కాంతమ్మనుంచి వెంటనే ఏం సమాధానం రాలేదు.

"నేను ఏమీ లేనివాణ్ణనేగా మీ సందేహం ? నీ పెళ్లయి యిక్కడికి వచ్చేటప్పుడు బావకి ఏం వుండిందేమిటి ? ఆ తర్వాత సంపాదించుకోలేదా ఏమిటి ?" అని నిగ్గదీసాడు. అయినా కాంతమ్మ ఆలోచన్నుంచి బయటపడ్లేదు.

"అవునూ. అసలు నేనందుకే పనిగట్టుకొని బయలుదేరి వచ్చాను, అక్కా. మీ యిష్టం. ఒళ్లోవున్న రత్నాన్ని నెత్తిమీద పెట్టుకుంటారో లేక నేలను జారవిడుస్తారో మీ యిష్టం. పోతే నేను మాత్రం ఒక గ్యారంటీ యిస్తాను. మంజుతల్లి మా యింట్లో పడితే పువ్వులా చూసుకుంటాం. బావకి ఏం చెపుతావో ఎలా ఒప్పిస్తావో అంతా నీకు వదుల్తున్నాను." అంటూ చెప్పదల్చుకుంది చెప్పి ముగించాడు రాజారావు.

బుగ్గన వ్రేలు పెట్టుకొని ఆలోచనలో పడింది కాంతమ్మ.

అంతలోనే సకిలిస్తూ బయట్నుంచి వచ్చాడు, భూషయ్య, మీసాల్దువ్వుకొంటూ. రాజారావు అతన్ని చూసి "బావగారు కులాసానా ?" అంటూ పరామర్శించాడు.

"ఆఁ. అదే బాగులేగాని ఎప్పుడొచ్చావోయి ? చెప్పాపెట్టకుండా." అన్నాడు భూషయ్య మొహం చిట్లించి, ఎందుకొచ్చావురా నాయింటికి అన్నట్లు.

"ఇందాకే వచ్చాను బావా. ఏమిటో ! నిన్ను చూసిపోవాలనిపించింది." అన్నాడు రాజారావు లవుకికంగా. నీ సంగతి నాకు తెలీదా అన్నట్టు చూసాడు భూషయ్య.

"అన్పించటానికేంలే. చెరువు నిండితే కప్పలు చేరినట్టు, డబ్బు చూస్తే ప్రతివాడికీ తపన. పోన్లె. ఇవాళుంటున్నావా ?" అందులో ఎప్పుడు పోతావన్న ధ్వనిని గ్రహించిన రాజారావు 'ఓరి పశువా ! నీకు ముడ్డి క్రిందకి నాల్గు డబ్బులు చేరగానే మంచి చెడు, చుట్టంపక్కం ఏం కనపట్టం లేదుగదా' అనుకుని, చిర్నవ్వు నవ్వి "వుంటాన్లె బావా. చాలాకాలమయింది; మనం కల్సి మాట్లాడుకుని. ఆ సర్దా అయినా తీరనీ." అని సర్దుకుని కూర్చున్నాడు, చిర్నవ్వు నవ్వుతూ. అలా కూర్చుని, "వూఁ. ఏంటి బావా ! నీ పేరు బెజవాడదాకా మోగిపోతూవుంది." అంటు అప్పుడే కాంతమ్మ తెచ్చిన కాఫీకప్పు అందుకున్నాడు. దానివంక చిరాగ్గా చూసి మొహంలోకి సీరియస్‌నెస్ తెచ్చుకుని, "అంటే ?" అన్నాడు భూషయ్య అసహనంగా.

"ఈ ఏడు ప్రత్తి వేసావటగా. బెజవాడ నుంచి మీ వూరు వస్తున్న బస్సులోని జనమంతా ఒకటే చెప్పకోటం. ఫలానా భూషయ్యగార్నే చెప్పకోవాలి రైతంటే. వ్యవసాయం అంటే ఆయనే చెయ్యాలి ఆ శ్రద్ధ ! ఆ పట్టుదల ? ప్రత్తిమీద లక్షలు తీస్తాడు — ఆవటాని." అంటు నవ్వాడు రాజారావు.

భూషయ్య ఉబ్బును అణుచుకొంటూ — "అవును. నలభై యెకరాల మాగాణి, ముప్పయ్యెకరాల మెట్ట వ్యవసాయం." అంటు చొంగ కార్చుకొంటు చెప్పకొచ్చాడు. రాజారావు ఆ ధోరణికి లోలోనే నవ్వుకుని "అవునుగానీ బావా. మొన్న అల్లుడొస్తే నాల్గురోజులయినా వుంచుకోకుండా పంపించేసావు ?" అంటు మేలమాడాడు రాజారావు. భూషయ్య మొహం చిట్లించాడు. ఆ మాట అసలు విననట్లే అవుపించాడు.

"అమ్మాయి, కారు కావాలంటోంది. ఎంబాసిడరు తియ్యాలా, ఫియట్ తియ్యాలా అంటే ఏదీ తేల్చుకోలేకపోతోంది." అంటు దాటవేసాడు భూషయ్య.

లోలోపల కారాలు మిరియాలు నూరాడు రాజారావు.

"అమ్మాయికి నాలుగయిదు లక్షలుదాకా ఇస్తాను. ఎవరయినా మంచి ఆస్తిపరుడు, అందగాడు, డాక్టరీ చదివిన కుర్రవాణ్ని చూడవోయి,

(47వ పేజీ చూడండి)



"ఔను. రవీ. పిచ్చివాళ్ల బాధ మామూలు మనుషులకు అర్థంకాదు." అన్నాడు కళ్లు మూతలుపడుతుండగా అశ్వని.

"సరే. ఇప్పటికే చాలా ప్రొద్దుపోయింది. మీరు కాసేపు నిద్రపొండి. విశ్రాంతి లేకపోతే నిజంగానే మీకు పిచ్చి పట్టేట్లున్నది" అంటూ ఒక దుప్పటి తీసి అతనిమీద కప్పింది రాణి.

ఆమె అలా అతనిని అనునయించటం, అతనికి దుప్పటి కప్పటం చూసిన తరువాత రవికి, అశ్వనికి కూడా మనసు ఆర్ద్రమయింది.

"చూడు రవీ! రాణి నేనొక దేవదాసు ననుకుంటుంది. ఎటుపడీ పార్వతి కాలేకపోయింది కదా, కనీసం చంద్రముఖిగానన్నా నాకు సేవలు చేద్దామనుకుంటుంది పాపం. కాని దేవదాసు ఎంత స్వార్థపరుడో ఆమెకు తెలియదు. చంద్రముఖిచేత ఎన్ని సేవలు చేయించుకున్నా చివరికి పార్వతి ఒడిలోనే కన్ను మూయాలని తహతహ లాడిపోయింది ఆ దౌర్భాగ్యుడి ప్రాణం" అన్నాడు అశ్వని.

అతనలా మాట్లాడుతుంటే రాణికి, రవికి యిద్దరికీ కళ్లలో నీళ్లు తిరిగినయ్.

"ఇంక మాట్లాడక నిద్రపోవటానికి ప్రయత్నించండి" అన్నాడు రవి.

కాని అప్పటికే విస్కీ మత్తుతోపాటు నిద్ర మత్తు కూడా ఆవహించింది అశ్వనిని.

ఐదు నిమిషాల్లో అతను గాఢనిద్రలోకి ఒరిగిపోయేడు. అది చూసి రాణి నిట్టూర్చింది.

రవి ఆమెవంక చూసేడు.

"ఆయన పార్వతి ఎవరో తెలుసుకుందామని ఎంత ప్రయత్నించినా తెలుసుకోలేకపోతున్నాను." అంది రాణి.

"కొన్ని విషయాలు తెలుసుకోకుండా ఉంటేనే మంచిది" అన్నాడు రవి.

రాణి అతనివంక చిత్రంగా చూసింది. "మీరు కూడా ఆయనలాగానే మాట్లాడతారు." అంది.

రవి నవ్వేడు.

"అందుకే కాబోలు ఆయన అంత త్వరగా మిమ్మల్ని స్నేహితుడిగా భావించేరు. మీరు చాలా అదృష్టవంతులు. నాకంటెకూడా..." అంది మళ్లీ.

రవి ఆమెవంక సానుభూతిగా చూసేడు. రాణి ఎంత వెకిలిగా ప్రవర్తించినా అది అశ్వనితోనే. ఇతరుల ముందు చాలా సభ్యతగా ఉంటుంది అనుకున్నాడు రవి.

రాణి అశ్వనిని ప్రేమిస్తున్న సంగతి స్పష్టంగానే తెలుస్తోంది. కాని తన ప్రేమని అందంగా వెల్లడిచేసే సంస్కారం, నిగ్రహం ఆమెలో లేవు. దానికి ఆమె పుట్టి పెరిగిన వాతావరణం, ఆమెకున్న పరిమిత పరిజ్ఞానం కారణాలు కావచ్చు. అందుకే అశ్వనిముందు ఆమె చులకనైపోతోంది. ఆమేకాదు. ఆమె ప్రేమకూడా అతనికి చులకనగానే వుంది అనుకున్నాడు రవి

"ఏమిటి ఆలోచిస్తున్నారు? మీ భవిష్యత్తును గురించి మీరేమీ చింతించనవసరంలేదు. అశ్వనిగారి చల్లనిచూపు తగిలిన మనిషికి జీవితంలో కష్టాలు, కన్నీళ్లు దగ్గరకు రావు" అంది రాణి. అలా అంటుంటే అశ్వని చల్లనిచూపు తనని తాక

# అహం – అనురాగం

సీరియల్

జి. పరిమళా సోమేశ్వర్

*(గత సంచిక తరువాయి)*

లేదన్న బాధ ఆమె కంఠంలో ప్రతిధ్వనించింది.

కాసేపుండి రాణికూడా కునుకు తీయసాగింది.

రవి మాత్రం అలాగే కళ్లు రెండూ తెరచి చూస్తూ కూర్చున్నాడు. నామాలును, అశ్వనిని, రాణిని మార్చి మార్చి చూడసాగేడు రవి. నిద్రావస్థలో వున్న మనుష్యుల ముఖాలను పరిశీలించి చూస్తుంటే చాలా చిత్రంగా వుంటుంది. మెలకువలో వుండగా కోపం, అసూయ, బాధ, ద్వేషం, ప్రేమ మొదలైన ఎన్నో భావోద్రేకాలతో నిండే మనిషి నిద్రకు లొంగిపోయి ఆదమరచి పడుకుని ఉండటం చూస్తుంటే మనిషి ఎంతటి బలహీనుడో, ఎంతటి అమాయకుడో, పసివాడోనని పించక మానదు.

గుండె నెంతటి రంపపుకోతపెట్టే సమస్య అయినాసరే నిద్రా దేవతముందు తల వంచవలసిందే!

శ్యామలకూడా అంత ప్రశాంతంగా నిద్రపోతూ వుంటుందా ఈ సమయంలో? భర్త పరారీ అయినాడన్న వార్త విన్నతరువాత ఏ స్త్రీ మాత్రం

> *జరిగిన కథ 13 :* స్త్రీల కళాశాల లెక్చరర్ శ్యామల, విద్యార్థినులతో నెహ్రూ జూలాజికల్ పార్కుకు వెళ్లివచ్చి, అక్కడ తనను ప్రమాదం నుంచి కాపాడిన వ్యక్తి బి ఎ. తప్పిన పేద చిరుద్యోగి అతనిద్వారా తెలుసుకుంటుంది. చంద్రను పెళ్లి చేసుకోవటానికి కూతురు శ్యామల నిరాకరించగా దిగులుతో ఆరోగ్యం చెడి మరణిస్తారు వెంకటేశ్వరరావుగారు. చంద్ర హెచ్చరిక లెక్కచేయక రవినే వివాహం చేసుకుంటుంది శ్యామల. ఇతరుల సూటిపోటీ మాటలవల్ల మనస్తాపం చెందిన శ్యామల వత్తిడితో అయిష్టంగా బి. ఏ. పరీక్షకు కట్టి తప్పుతాడు రవి. తను పనిచేస్తున్న కంపెనీలో రిట్రెంచిమెంటువల్ల వుద్యోగం పోయి మానసికంగా దిగజారిపోయిన రవి– శ్యామల తొందరపాటుతనంవల్ల ఇల్లు విడిచి వెళ్లిపోతాడు. తన తొందరపాటుకు పశ్చాత్తాపపడ్డ శ్యామల బాబులో రవిని చూసుకుంటూ, రవి కుటుంబాన్ని ఆదరిస్తుంది. ఇంట్లోంచి వచ్చేసి మద్రాసు బయల్దేరిన రవికి రైల్లో సినీ రచయిత అశ్వనిబాబుతో పరిచయ మవుతుంది.

సుఖంగా నిద్రపోగలదు? పాపం! ఒంటరిగా ఆ పక్కమీద ఎలా బాధపడుతూ పడుకునివుందో! అసలే ప్రసవదినాలు. ఈ షాక్ ఆమె గర్భానికేమీ ముప్పు తెచ్చిపెట్టదుకదా?

తానిప్పుడు ఎంతటి అశక్తుడు! అర్థాంగిని అవసరానికి ఆదుకునే శక్తి తనకిప్పుడు లేదు. తన భార్యను, తన బిడ్డను దగ్గరుండి చూసుకునే అదృష్టం తనకి లేదు. ఈ అశ్వనితోటి పరిచయం తన నెక్కడకు తీసుకుపోతుందో జలపాతవేగంతో పరుగెత్తే ఆ సినీ జీవితంలో తను యిమడగలడా? ఆ వేగం తనని మెత్తని పచ్చిక బయళ్లమీదకు చేర్చుతుందో, కఠిన శిలలపైకి గిరాటు వేస్తుందో!

అలా వివిధ రకాలుగా ఆలోచించుకుంటూ కూర్చున్న రవి తనకి తెలియకుండానే తెల్లవారు ఝామున నిద్రలోకి ఒరిగిపోయేడు.

నామాలు యొక్క భీకర కంఠ స్వరానికి మెలకువ వచ్చేసరికి ఉదయం ఏడు గంటల పైగా అయింది. రాణి, అశ్వని, నామాలు అందరూ ముఖ ప్రక్షాళనం చేసుకుని రాబోయే స్టేషన్లో యిడ్లీ, కాఫీ సేవించటానికి సిద్ధంగా ఉన్నారు. నామాలు ముఖ కళవళికలను బట్టి అశ్వని తనని వెంటతీసుకుపోతున్నట్లు చెప్పేడని గ్రహించేడు రవి.

చివరికి రైలు మద్రాసులో ఆగిన తరువాత వాళ్లతోపాటు రవికూడా దిగేసరికి నామాలు అతని వంక గుర్రుగా చూసేడు. "ఏం అశ్వనిబాబూ! నీ మాటకిక తిరుగులేదేటి? ఈ దర్రిద్రుడి బాధ నీ కెందుకు చెప్పు" అన్నాడు.

"అలా అనకండి. ఆ మాటకి వస్తే మహా మహా పేరు ప్రఖ్యాతులు గడించినవారంతా ఒకప్పుడు యితనికన్నా దరిద్రంగా బ్రతికినవాళ్లే కదండీ! ఏమో ఎవరి అదృష్టం ఎలా ఉందో ఎవరు చెప్పగలరు? మరో పది సంవత్సరాలు పోతే యితను నాకంటె, మీకంటెకూడా ధనవంతుడౌతాడేమో! సినీ రంగంలో అదృష్టదేవత జరిపే లీలలు మీకు తెలియవు గనకనా!" అన్నాడు అశ్వని.

ఆ రోజే రవిని సరాసరి తను బస ఉండే హోటలుకు తీసుకుపోయేడు అశ్వని.

"మీకు యిల్లు లేదా?" అనడిగేడు రవి.

"ఒంటరివాణ్ణి. బ్రహ్మచారిని. నా కెందుకు యిల్లు?" అన్నాడు నవ్వుతూ అశ్వని.

"అదేమిటి? ప్రపంచంలో ఎంతమంది బ్రహ్మచారులు లేరు? వాళ్లంతా యింట్లో– కనీసం ఒక్క రూములోనైనా ఉంటారు కాని యిలా హోటల్లో శాశ్వతంగా బస చేసేవాళ్లను ఎక్కడా చూడలేదు నేను" అన్నాడు రవి.

"సంసారపక్షంగా బ్రతకటం, గృహస్థుల మధ్య జీవించటం నా ఒంటరి జీవితానికి, నా మనస్తత్వానికి పడదు. ఎప్పుడూ ఒక యాత్రికుడిలా ఊరంతా తిరిగి, సమయానికి హోటలుకి వచ్చి తిని, నిద్రపోవడమే నా జీవితానికి సహజంగా ఉంటుందనుకుంటాను" అన్నాడు అశ్వని.

రవి అతనిని యింక ఆ విషయమై మరేమీ ప్రశ్నించదలచుకోలేదు.

కాసేపాగి అశ్వనే అన్నాడు. "మనిద్దరం ఒడ్డూ పొడుగూ ఒకేలాగున్నాం. నా బట్టలు నీకు

సరిపోతాయి. మొహమాటపడకుండా తొడుక్కో. నువ్వు సంపాదించటం ప్రారంభించిన తరువాత వడ్డీతోసహా నా ఋణం తీర్చుకుందువుగాని. ఆ భయం నీకేం అక్కర్లేదు. నా డబ్బును నా ఇష్టం వచ్చినట్లు ఖర్చుపెట్టే స్వాతంత్ర్యం నాకుంది. నీకా ప్రస్తుతం డబ్బుయొక్క అవసరం చాలావుంది. కనుక నీకేం కావాలన్నా మొహమాటపడక నాదగ్గర తీసుకో. ఊరికేకాదులే. ఈమధ్య సినీ రచయితగా నా పరపతి ఎక్కువైపోతోందేమోనని నాకు భయంగా వుంది. నాకూ ప్రస్తుతం ఒక అసిస్టెంటు కావాలి. నువ్వు రచయితవే కనుక నాకు తప్పక సాయపడగలవనుకుంటాను. ఇటీవల నేను సంభాషణలతోపాటు పాటలుకూడా వ్రాస్తున్నాను. రెండు పిక్చర్లకు దర్శకత్వం వహించమని 'ఆఫర్స్' కూడా వచ్చినయ్. నాకు చేదోడు వాదోడుగా వున్నావంటే నాకూ, నీకూకూడా లాభదాయకమే. ఏమంటావు ?'' అన్నాడు.

''మీరెలా చెప్తే అలా చేస్తాను. నన్ను మీరు సరియైన మార్గంలో పెడ్తారనే నమ్మకం నాకుంది'' అన్నాడు రవి.

''ఐతే సరే. ఆఖరిసారిగా చెప్తున్నాను. నా త్రాగుడూ, ప్రవర్తనా అది నీకు కాస్త వింతగా కనిపించవచ్చు. కాని నాగురించి వివరాలేవీ అడగవద్దు. నిన్ను గురించి నేనుకూడా ఏమీ అడగను. నీ రహస్యాలను నీలోనూ, నా రహస్యాలను నాలోనూ వుండిపోనీయ్! కొన్ని రహస్యాలు రహస్యాలుగా వుండిపోతేనే అందంగా వుంటయ్‌కదూ ?'' అన్నాడు విస్కీబాటిల్ మూతతీస్తూ అశ్విని.

## 9

చంద్ర పెళ్లి అయిన తరువాత పదిహేను రోజులకు కాలేజీలు తెరచేరు. చంద్ర వివాహం వైభవంగా జరిగినట్లు, లేడీ హైద్రీ క్లబ్బులో ఘనమైన పార్టీ జరిగినట్లు వధూవరుల ఫొటోలతో సహా పేపర్లో ప్రకటించుకున్నాడు చంద్ర.

ఆ రకంగానైనా తమ వివాహవార్త శ్యామలకు చేరుతుందన్న భావం అతని కున్నదని స్పష్టంగానే తెలిసిపోతోంది ఆమెకు. మనసులో ఎంత మంటగా ఉన్నా అతని వివాహాన్ని గురించి ఆమెకుకూడా కుతూహలం లేకపోలేదు. అందుకే పేపర్లోని వధువు ఫొటోని పరిశీలనగా చూడసాగింది. ఆమె చాలా అందంగా ఉండటమేకాదు. అధునాతనంగా అలంకరించుకుని కూడా ఉంది. భర్తను అన్ని విధాలా ఆకట్టుకోగలనన్న ధీమా కూడా ఉంది ఆమె ముఖంలో.

అసూయ అంటే ఏమిటో మొదటిసారిగా అనుభవంలోకి వచ్చింది శ్యామలకు. డబ్బు కాశపడి చంద్ర ఏ కురూపినో ఏ అక్షరజ్ఞానం లేని అమ్మాయినో చేసుకున్నట్లయితే ఆమెకు ఎంతో తృప్తిగా ఉండేది. ''నన్ను అవమానపరచినవాడు అంతకంటె ఏం బావుకుంటాడులే!'' అన్న గర్వం, కసి ఉండేవి. కాని అపురూప లావణ్యవతి, విద్యావతి, ఉద్యోగస్థురాలు, ధనికురాలు అయిన స్త్రీని చేపట్టేడన్న భావం ఆమె గుండెలో గుచ్చుకుంటోంది.

తను సుఖంగా లేనప్పుడు తన పరిచయస్తులు, బంధువులు, స్నేహితులూ ఎవ్వరూకూడా సుఖంగా ఉండకూడదన్న ఆలోచన ప్రతి సామాన్యమైన వ్యక్తికీ కాస్తో కూస్తో ఉంటుంది. తమలో అలాటి ఆలోచనలున్నాయని కొందరికి తెలియకపోవచ్చు. కాని ఆ ఆలోచన ఎన్నో రూపాలలో, ఏదో ఒక విధంగా బహిర్గత మవుతూనే ఉంటుంది.

తానింత దుఃఖంలో ఉండగా ఎదుటి వ్యక్తికి సుఖపడే అధికారం ఎక్కడ ఉంది ? అన్న ప్రశ్న చాలామంది దుఃఖితులలో తలెత్తుతూనే ఉంటుంది. వారికి తెలియకుండానే వారిలో ఓర్వలేనితనం చోటు చేసుకుంటుంది. అందుకే లోకం అంతటా ఈర్ష్యాద్వేషాలు, పగ, అశాంతి వ్యాపించి ఉన్నయ్.

కొంతసేపు అలా గుండెను మండించే ఆలోచనలతో కొట్టుమిట్టాడినా శ్యామలలో వెంటనే వివేకం మేల్కొన్నది. ఆమెలోని సంస్కారవంతమైన 'వ్యక్తి' ఆమెయొక్క బలహీనతలను చూసి సిగ్గుపడింది.

చంద్రకి, తనకీ ఏం సంబంధం ? అతనిని చూసి, అతని భార్యని చూసి తానెందుకు అసూయపడాలి ? తన మూర్ఖత్వంతో తన సంసారాన్ని తానే చేజేతులా విచ్ఛిన్నం చేసుకుంది. అది చాలక యింక తను ఒకరిని చూసి అసూయపడటం కూడానా ? అందుకే అంటారుకాబోలు కష్టాలలో వున్న మనిషి కర్కోటకుడౌతాడని. కాని అది కేవలం సామాన్యుల లక్షణం. వివేకవంతుడు, సజ్జనుడు అయిన వ్యక్తి కష్టాలవల్ల, కన్నీళ్లవల్ల పరిశుద్ధుడు కావాలి. అంతేతప్ప మానవత్వాన్ని ఎన్నటికీ కోల్పోకూడదు. అలా తనని తాను నిగ్రహించుకోవటానికి ప్రయత్నించింది శ్యామల.

కాలేజీలు తెరిచేక మొదటిసారిగా కాలేజీలో ప్రవేశిస్తుంటే ఆమె గుండె దడదడలాడింది.

ఏదో నేరంచేసి నలుగురిలోనూ పట్టుబడిపోయినదానిలా ఫీలవసాగింది.

చాలామందికి అప్పటికి శ్యామల యింట్లో జరిగిన విషయాలు తెలియవు. ఒకరిద్దరికి మాత్రం తెలుసును. ఆ ఒకరిద్దరు పుణ్యాత్ములు తమకు రూఢిగా తెలిసిన వార్తను చిలవలు పలవలు చేసి కాలేజీలో ప్యూన్ దగ్గర నుండి ప్రిన్సిపాలు వరకు



## అహం – అనురాగం

అందరికీ చేరవేసేరు నాలుగురోజులు గడిచేసరికి.

"శ్యామల భర్త పరారీ అయినా"డని కొందరు, "శ్యామల మొగుణ్ణి యింట్లో నుండి వెళ్లగొట్టిం"దని కొందరు, "శ్యామల భర్త శ్యామలను వదిలివేసే"డని కొందరు, "శ్యామల, ఆమె భర్త విడిపోయేరు. విడాకులుకూడా .తీసుకోబోతున్నారు" అని కొందరూ యిలా రకరకాలుగా ఎవరికి నచ్చినట్లు వారు చెప్పుకుని సంతృప్తిపడ్డారు.

ఏమైనా శ్యామల భర్తకు దూరమయిందన్న వార్త విన్న తరువాత ఏ కొద్దిమందోతప్ప చాలా మంది ఒక క్రూరమైన ఆనందాన్ని పొందేరు.

"లక్షణమైన మగవాళ్లు లోకంలో యింత మంది వుంటే ఆ గుమాస్తాగాడే కావాలి అని పట్టుబట్టి చేసుకుంది. పోనీ చేసుకున్నదేదో చేసుకున్నదిలే అనుకుంటే అతనితోకూడా సరీగ్గా కాపరం చెయ్యలేకపోయింది. ఏం మనిషో! ఏం మనస్తత్వమో! ఎంత చదువుకున్నా ఆడదానికి అంత మిడిసిపాటు తగదు. కట్టుకున్న మొగుణ్ణి యింట్లో నుండి వెళ్లగొడుతుందా? అవ్వ!" అంటూ ఆ పోస్ట్‌గ్రాడ్యుయేట్ స్త్రీలందరూ బుగ్గలు నొక్కుకున్నారు.

ఒకప్పుడు తన భర్తని గురించి యెంతో హీనంగా మాట్లాడి, "అలాటివాడితో యెలా బ్రతుకుతున్నావో, ఏమో" నంటూ సానుభూతి చూపినవాళ్లే యీరోజు / ప్లేటు ఫిరాయించి మాట్లాడటం చూస్తుంటే శ్యామలకి మతిపోయినంత పనయింది.

"నీ భర్త గుమాస్తా" అని కొన్నాళ్లూ "నీ భర్త ఉద్యోగం సద్యోగం లేని చవట" అని కొన్నాళ్లూ తమ దాంపత్యాన్ని వేలెత్తి చూపి, తన మనసును విరిచి తననీ స్థితికి తీసుకువచ్చింది వీళ్లుకాదూ? అజ్ఞానంతో, మూర్ఖత్వంతో తానే వాళ్ల మాటలకు తట్టుకోలేక, లేనిపోని అహంకారాన్ని పెంచుకుని పాలకుండలాంటి తన మనసునీ, అందులోని అనురాగాన్నికూడా విరిచేసుకుని తన కత్యంత ప్రేమపాత్రుడైన రవిని పోగొట్టుకుంది. తప్పు తనదే! వీళ్లనని ఏమీ లాభంలేదు.

లోకం మొరిగే కుక్కవంటిది. భయపడి పరుగెత్తుతున్న మనిషినే వెంటపడి మొరిగి యింకా భయపెడుతుంది. దానిని పట్టించుకోకుండా తన దారిని తాను పోయే నిబ్బరంగల మనిషిని చూసి, తానే భయపడి తోక ముడుచుకుని పారిపోతుంది.

ఈ సత్యాన్ని తాను చాలా ఆలస్యంగా గ్రహించింది. కాని చేతులు కాలిన తరువాత ఆకులు పట్టుకుని ఏం లాభం? ఈ కాలిన చేతులు పుళ్లయి తనని బాధపెట్టక మానవు. ఆ గాయాలు మానేదాకా బాధను ఓర్చుకోవటంతప్ప చేసేదేం లేదు.

ఒకసారి స్టాఫ్ రూములో ఒక లెక్చరర్ వెక్కి వెక్కి ఏడుస్తోంది.

"ఏమయింది? ఏమయింది?" అని మిగతా వారంతా సానుభూతిగా, కుతూహలంగా అడుగుతున్నారు.

ఆమె కీమధ్యనే పెళ్లయింది. ఆమె కొంత సేపు ఏడిచి, తరువాత తన ఏడుపుకు కారణాన్ని చెప్పింది. ఆమెకు పెళ్లయినదగ్గర నుండి మన శ్శాంతే కరవైందిట. కాలేజీలో పనిచేసి యింటికి వెళ్లినదగ్గర నుండీ యింటెడు చాకిరీ తానే చేసుకోవలసి వస్తోందిట అత్తగారు ఒక్క చిన్న పని కూడా ముట్టదుట. పైగా ఇంటికి వెళ్లేసరికి రెడీగా కావలసినంత పనిని ఉంచిపెడుతుందిట. ఆఖరికి భర్తకూడా తనతో సహకరించడు, సానుభూతి చూపించడు. పైగా తనని మాటలతోను, చేతలతోను బాధపెడుతూ ఉంటాడుట. తల్లి మాట విని ఉదయం తనమీద చెయ్యికూడా చేసుకున్నాడుట. ఇల్లు నరకంలాగా ఉందనీ, తనకు బ్రతుకుమీదనే విరక్తి పుడుతోందనీ చెప్పి మళ్లీ ఏడవటం ప్రారంభించిందామె.

అందరూ తలాఒక రకంగా ఆమె నోదార్చ పాగేరు.

"ఏం ఆడబ్రతుకో ఏం పాడో! అందుకే అన్నారు మన పెద్దలు. 'ఆడదై పుట్టటం కంటె అడవిలో మానై పుట్టటం మంచి' దని. పుట్టిన దగ్గరనుండి చచ్చేదాకా ఆడదానికి ఏవోఒక సమస్యలే! ఎంత చదువుకున్నా, ఎంత ఆస్తిపాస్తులున్నా ఆడది ఒకళ్లమీద ఆధారపడి జీవించవలసిందేకదా! అందుకే ఆడదానికి యిన్ని బాధలు" అన్న దొకామె.

"దీనికంతటికీ కారణం మగవాళ్లు. వాళ్ల అహంకారానికి, అజ్ఞానానికి స్త్రీ బలియైపోతోంది" అన్నది యింకా పెళ్లికాని ఒక వయసుమళ్లిన లెక్చరర్.

"మగవాడి కంత అహంకారం ఎందుకు వచ్చింది? సమాజంవల్లనే కదా! మన సమాజంలోని నీతి నియమాలు, కట్టుబాట్లు అన్నీ పురుషుడిని అధికుడిగా, స్త్రీని బానిసగా చేస్తున్నయ్." అన్నది మరొకామె.

"ఆ నియమాలను చేసింది ఎవరు? పురుషులే కదా. తమ ఆధిక్యతను నిలబెట్టుకోవటానికి అనువైన రీతిలోనే కట్టుబాట్లను కూడా విధించుకున్నారు. సమాజం వేరు. పురుషులు వేరు అని అందుకే మనం భావించకూడదు" అన్నదొక సొసైటీ లేడీ.

"ఆడదానికి మగవాళ్ల వల్లకాని, సంఘంవల్ల కాని అన్యాయం జరుగుతున్న మాట నిజమే. కాని స్త్రీకి స్వభావసిద్ధంగా ఓర్పు అనేది ఉండాలి. సహనమే స్త్రీకి ఆభరణం. మగవాళ్లేమన్నా ఆడది సర్దుకుపోవాలి" అంటూ ఒకామె పతివ్రతా లక్షణాలను ఏకరువు పెట్టసాగింది.

"సర్దుకుపోక మనమందరం ఏం చేస్తున్నాంలే! మొగుణ్ణి విడిచిపెడుతున్నామా? విడాకులిస్తున్నామా?" అన్నదొకామె.

"ఇంకా నయం. విడిచిపెట్టటమా? రామ రామ! ఎంత మాట! ఎంత చదువు చదివితేనేం, ఆడదానికి భర్తే దైవం!"

"ఆఁ మీవన్నీ పాతకాలం మాటలు! ఈ రోజుల్లో యింకా ఎవరండీ మొగుణ్ణే దేవుడిగా భావించేది? భర్తని యింట్లోనుండి వెళ్లగొట్టే ఘనులుకూడా ఉన్నారండీ ఆడవాళ్లలో" అందొకామె పదునుపెట్టిన కత్తిని విసిరినట్లు మాటలను విసురుతూ.

ఆ కత్తి తగలవలసిన వ్యక్తికి తగలనేతగిలింది.

"ఏమోనబ్బా! నా మటుకు నాకు ఆడది అంతగా బరితెగించటం ఏమాత్రం యిష్టంలేదు. ఆడదానికి స్వాతంత్ర్యం ఉండాలి. కాదనను. కాని మొగుణ్ణి యింట్లోనుండి వెళ్లగొట్టే స్వాతంత్ర్యం మాత్రం మనకి వద్దు."

అంటూ చివరికి అందరూ స్త్రీకి పాతివ్రత్యమే ఆభరణమనీ, భర్త ఎలాటివాడైనా అతనిని ప్రత్యక్ష దైవంగా చూడాలనీ తీర్మానించుకున్నారు. ఆ తీర్మానానికి ముందు సంభాషణ ఎన్ని మలుపులు తిరిగిందీ, ఎక్కడనుండి ఎక్కడకు గంతులు వేసిందీ అన్నీ శ్రద్ధగా వింటున్న శ్యామలకు తెలియకపోలేదు. తెలిసి మాత్రం ఆమె చేసేదేముంది?

వాళ్ల మనసుల్లో మకిలి ఉండవచ్చు. కాని వాళ్లన్నమాటల్లోకూడా నిజం ఉందికదా. భర్త ఎలాటివాడైతేనేం? భార్యగా ఒక స్త్రీ అతనిని గౌరవించవలసిందే కదా. ఈ విషయం స్త్రీలకే కాదు. పురుషులకు కూడా వర్తిస్తుంది. భార్యలో ఎన్ని లోపాలున్నా భర్త సహించి ఆమె నాదరించాలి. అలా కానినాడు, భార్యా భర్తలు ఎవరికివారు తాము అధికుల మనుకుంటూ ఎదుటి వ్యక్తిని కించపరచి, దూరం చేసుకుంటే యింక వివాహ వ్యవస్థవల్ల ప్రయోజనం యేమిటి? దాంపత్య జీవితంలోని అందమేమిటి?

దాంపత్య జీవితం అద్దంలా ఎంత నిర్మలమైనదో, అంత సున్నితమైనదికూడాను. దానిని ఎంతో జాగ్రత్తగా కాపాడుకోవాలి. జీవితంలో ఒక్కసారి చెయ్యి జారిందంటే అది పగిలి ముక్కలై తీరుతుంది.

మామూలు స్త్రీలందరికీ ఉండే ఆ మాత్రం యింగిత జ్ఞానం కూడా తనకి లేకపోయింది. తనేదో ప్రత్యేక రకం స్త్రీయని, తన వ్యక్తిత్వంలో విశిష్టత ఉందనీ, తనలాటి స్త్రీ యీ భూప్రపంచంలో ఉండదనీ ఏమేమో ఊహించుకుంది. ఆ అహంకారంతోనే చంద్ర మనసును గాయపరచింది. వృద్ధుడైన తండ్రికి మనఃక్లేశాన్ని కలిగించింది. ఆఖరికి మనసారా ప్రేమించి పెళ్లాడిన భర్తను కూడా తూలనాడింది. తన పాపానికి ప్రాయశ్చిత్తం లేదు. తనకింక నిష్కృతి లేదు అనుకుంటూ రోదించసాగింది శ్యామల.

ప్రతిరోజూ శ్యామల కొక గండంగా ఉంది. ఇంట్లో కస వూడ్చే పనిమనిషి దగ్గరనుండి కాలేజీలో కొలీగ్సు వరకు ప్రతి మనిషీ తనని అసహ్యించుకుంటున్నట్లు, తనని పరిహసిస్తున్నట్లు ఫీలవసాగింది.

ఏ మనిషి నవ్వినా తనని వెక్కిరిస్తున్నట్లే ఉంటుంది. ఏ మాట విన్నా అందులో తనని గూర్చిన వక్రోక్తి ఉన్నట్లే భావించేది శ్యామల.

నిజానికి ప్రపంచంలో అన్యోన్యంగా జీవించే దంపతులు చాలా అరుదు. ఏ ఒకరిద్దరి విషయంలోనో తప్ప చాలామంది భార్యాభర్తలలో ఒకరిని గురించి మరొకరికి యేదో ఒక రకమైన అసంతృప్తి ఉండకమానదు. కాని సంఘానికో, నీతికో వెరచి సర్దుబాటు చేసుకోవటమో లేక లోపల ప్రేమ లేకపోయినా ఉన్నట్టు నటించటమో చేస్తారు.

(47 వ పేజీ చూడండి)



# 'ధర్మపథం' సత్వగుణ ప్రయోజనం

బులుసు- వేంకటరమణయ్య

సత్త్వం, రజస్సు, తమస్సు అని గుణాలు మూడు విధాలనీ, వాటిలో తమోగుణం కంటె రజోగుణం మేలనీ, రజోగుణం కంటె సత్త్వగుణం మేలైనదనీ, సాత్త్వికులు తక్కినవారికంటె సులభంగా భగవంతుని చేరగలుగుదురనీ తెలిసినవారు అంటారు.

అయితే, సత్త్వగుణం ఉత్తమమైనదే అయినా— ఆ గుణం ఉన్నంత మాత్రాన భగవంతుని చేరలేము. అది భగవంతుని చేరడానికి మార్గాన్ని మాత్రం చూపగలదు. ఆ మార్గాన్ని అనుసరించి వెళితే భగవంతుణ్ణి చేరుకోవచ్చు.

దీనికి శ్రీ రామకృష్ణ పరమహంస ఒక చక్కని ఉదాహరణాన్ని తెలియజేశారు—

ఒక వ్యక్తి అడవి మార్గంగా తన ఊరికి పోతూఉండగా ముగ్గురు దొంగలు అతన్ని పట్టుకొని, అతని సొమ్మంతా దోచుకున్నారు. అయినా వారికి తృప్తి కలగలేదు. ఒక దొంగ అతన్ని చంపడానికి సిద్ధపడ్డాడు. కాని వారిలో ఒకడు "వీణ్ణి చంపినందువల్ల మనకేం ప్రయోజనం? కాళ్ళా, చేతులూ కట్టేసి విడిచిపెట్టి పోదాం" అని మొదటి దొంగను సమ్మతింపజేశాడు. వారా మనుష్యుని కాలు చేతులు కట్టివేసి వెళ్ళిపొయ్యారు.

కొంతసేపయాక మూడవదొంగ వచ్చి, అతని కట్లు విప్పివేసెను. 'అంతే కాకుండా ఆతన్ని ఆ అడవిని భద్రంగా దాటించి, అతని ఊరిదగ్గర విడిచిపెట్టి, ఆ దొంగ వెనుకకు పోసాగెను. అప్పుడా మనుష్యుడు సవినయంగా "అయ్యా! నీవు నాకట్లు విప్పడమే కాకుండా అడవి దాటించి నన్ను భద్రంగా మా వూరికి చేర్చావు. నీ ఋణం తీర్చుకోలేను. మా యింటికి వచ్చి నా ఆతిథ్యం స్వీకరించి వెళ్లాలని నా ప్రార్థన" అని అన్నాడు. ఆ దొంగ "నేను మీ యింటికి రావడం నాకే ముప్పు. అక్కడికి వస్తే జనులు నన్ను చూస్తారు. నేను దొంగనని గ్రహించి పోలీసులకు అప్పగిస్తారు. మీ యింటికి దారి చూపడమే నా పని. నా పని తీరింది కనుక, నేను వెళ్లిపోతాను" అని చెప్పి వెళ్లిపోయాడు.

బాటసారిని చంపాలన్నవాడు తమోగుణం వంటివాడు. కాళ్లు చేతులు కట్టివేసి, ఆ అడవిలో విడిచిపెట్టి పోదామని చెప్పినవాడు రజోగుణం వంటివాడు. కట్లు విప్పి అడవి నుంచి బయటపడునట్లు చేసి, ఊరిదగ్గర దిగపెట్టినవాడు సత్త్వగుణం వంటివాడు.

ఉత్తమమైన సాత్త్వికగుణం భగవంతుణ్ణి చేరే మార్గాన్ని చూపుతుందేగాని, ఆ గుణం ఉన్నంతమాత్రాన భగవత్సాన్నిధ్యం లభించదని తెలుసుకోవాలి.

---

## నీతి

(18వ పేజీ తరువాయి)

వున్నాడు. ఆయన గిరికి కాస్త బంధువు కూడా. ఆయన దగ్గరికెళ్లాలంటే బస్సులో ఆరుమైళ్లు ప్రయాణం చెయ్యాలి. ఆటో అయితే చాలా డబ్బు అవుతుందని బస్సుకోసం నిలబడ్డాడు.

బస్సు మెల్లిగావచ్చి ఆగింది. బస్సునిండా జనం కిటకిట లాడుతున్నారు.

కమల బస్సు ముందునుండి ఎక్కింది. గిరి బస్సు చివర నుండి ఎక్కాడు చాలా కష్టపడి (మగవాళ్లని బస్సు ముందర నుండి ఎక్కనివ్వరు.) బస్సు బరువుగా కదిలింది. బస్సు ఫుట్‌బోర్డు మీద దాదాపు డజను మంది నిలబడ్డారు ఒకళ్లమీద ఒకళ్లు ఎక్కి. వాళ్లంతా పళ్లబుట్టలోంచి ఓ ద్రాక్షగుత్తి బయటకు వచ్చినట్టుగా వేలాడుతున్నారు.

గిరికి చమటపోసి చొక్కా అంతా తడిసిపోయింది. మెల్లగా జనాన్ని తోసుకుంటూ బస్సు ముందరి వేపుకు వచ్చాడు. అక్కడ ఆడామగా తేడాలేకుండా జనం నిలబడ్డారు. కమల ఇబ్బందిగా అటూఇటూ కదుల్తోంది ఆ జనం మధ్య.

గిరి చూసాడు. మాటాడకుండా నిలబడిపోయాడు. ఎవరైనా ఆడవాళ్లు దిగడానికి లేస్తారేమో, ఆ సీట్లో కమలని కూర్చోమని చెబుదామని అటూ ఇటూ చూస్తున్నాడు. ఎవరూ దిగేట్టుగా కన్పించలేదు.

బస్సు నాలుగైదు స్టేజిల్లో ఆగింది. అప్పటికి కాస్త బస్సులో రద్దీ తగ్గింది.

ఎవరో ఆడమనిషి లేచివెళితే కమల అక్కడ కూర్చుంది. మరికాస్త దూరం పోయాక, గిరికి నిలబడ్డ చోటే ఓ సీటు ఖాళీ అయింది. హమ్మయ్య అనుకుంటూ కూర్చున్నాడు

గిరి సీటులో వెనక్కివాలి కూర్చున్నాడు. అప్పటివరకు బస్సులో ఎక్కి జనంమధ్య నలిగిపోయిన శ్రమనంతా మర్చిపోసాగాడు.

బస్సు మరో స్టేజిలో ఆగింది. మళ్లా కదిలింది.

గిరి ఏదో ఆలోచిస్తున్నవాడల్లా మొదటి వరస సీట్లో కూర్చున్న భార్యవైపు చూసాడు. ఆమె సీట్లో కిటికీవైపు ఒదిగి కూర్చుంది. ప్రక్కన ఎవరో ఒకతను కూర్చున్నాడు:

గిరి గుండె మండింది. తన భార్య ప్రక్కన అలా కూర్చుంది ఎవడు? వాడికసలు జ్ఞానం వున్నట్టులేదే! మూడు వరసలు ఆడవాళ్ల సీట్లు. అందులో మగవాళ్లు కూర్చోడానికి వీలులేదు - ఆడవాళ్లు వున్నప్పుడు. అతను బస్సులో ఎక్కడా సీటులేక అక్కడ కూర్చున్నాడనటానికి వీటులేదు. బస్సులో రెండుమూడుచోట్ల సీట్లు ఖాళీగా వున్నాయి. మరి ప్రత్యేకంగా వాడక్కడ ఎందుకు కూర్చున్నట్టు? వెళ్ళి లేవమనిచెప్తే? చూస్తే కావాలని కూర్చున్నాడల్లే వుంది. అదేనిజం. వాడు మధ్యమధ్యలో కమలకేసి చూస్తున్నాడు.

## నీ తి

గిరి లేచాడు. అతని మొహమంతా ఎర్రగా అయింది. ఎంత నిగ్రహించుకుందామన్నా కుదరడంలేదు అతని కోపం. కమలకూర్చున్న చోటుదగ్గరికి కదులుతున్న బస్సులో తడబడుతూ చేరుకున్నాడు.

కమల ప్రక్కన కూర్చున్న మనిషిని చూసాడు.

జుట్టు బాగా పెంచాడు. వెడల్పాటి కళ్ళజోడు పెట్టుకున్నాడు. నల్లగా వున్నాడు. మీసాలు బాగా క్రిందికి దిగినట్టుగా కత్తిరించుకున్నాడు. వెడల్పాటి బెల్టు, రంగు రంగుల డిజైనుగల చొక్కా, చారల బెల్‌బాటం పాంటుతో వున్నాడతను.

గిరి అతని భుజం తట్టాడు. అతను చాలా నెమ్మదిగా తలపైకెత్తి ఏమిటి అని చూశాడు.

'ఇది ఆడవాళ్లసీటు' కటువుగా అన్నాడు గిరి.

'అయితే ఏమిటి ?' హిందీలో అడిగాడు.

గిరి రక్తం పొంగింది. కళ్లు ఎర్రనయ్యాయి. కోపంతో ఒణికిపోతున్నాడు.

'ఇది ఆడవాళ్లసీటు. మగవాళ్ళు కూర్చోకూడదు. అక్కడ చోటుంది వెళ్లికూర్చో' అరిచాడు.

'నువ్వెళ్లి కూర్చో!' అని తాపీగా తలతిప్పుకున్నాడు.

'ఏయ్ ! కండక్టర్ !' వీడ్ని... ఈసోరం దల్ని సీట్లోంచి లేపు'అని అరిచాడు.

బస్సులో అందరూ గిరివంక చూసారు. కండక్టర్ దగ్గరికి వచ్చాడు.

'ఇది ఆడవాళ్ళ సీటు! లే తమ్ముడూ!'అని హిందీలో చెప్పాడు కండక్టర్.

'నీ కెందుకు పోనయ్యా !'అన్నాడతను. కండక్టర్ మాట్లాడ లేదు. 'లేవమంటే లేవరండీ ఏం చెయ్యమంటారూ?' గిరివేపుకు తిరిగి అని వెళ్లిపోయాడు కండక్టర్.

గిరి అసహాయంగా అందరివేపుకిచూసాడు. ఎవరూ గిరికి సహాయంరాలేదు. మన కెందుకొచ్చిన గొడవ అన్నట్లుగా కూర్చున్నారు.

దెబ్బ తిన్నమనిషిలా అయిపోయాడు గిరి. కోపం కట్టలు తెంచుకుంది. రక్తం నరనరాల్లోకి వేగంగా ప్రవహించింది. ఒళ్లంతా సెగలు కక్కింది. పట్టుకున్న పైజినను కష్టని వదిలేసి రెండు చేతులూ కమల ప్రక్క కూర్చున్న మనిషిమీద వేశాడు. బలవంతంగా లేపడానికి ప్రయత్నిస్తూ 'చెప్తుంటేసీక్కాదూ? సిగ్గులేదూ...ఆడమనిషి ప్రక్కన కూర్చుని పైగా గీరగా మాట్లాడతావా?'అన్నాడు.

'వదులు...వదులు' హిందీలో అని గిరిని విదిలించిపారేశాడు అతను.

గిరి పిచ్చివాడయ్యాడు. ఆ మనిషి మెడ వంచి వీపు మీద దభీ దభీ మని గుద్దాడు. అతను లేచాడు.

పెద్దగొడవయింది.

అప్పుడు బస్సులోని వాళ్లంతా కలగజేసుకొని ఇద్దర్నీ విడదీసారు.

కమలబిత్తరపోయి చూస్తోంది గిరిని.

'ఛీఛీ...నీతిలేని మనుషులు. ఆడవాళ్లని గౌరవించని నాయాళ్ళు. కుక్కలు...ఛీ...థూ వీళ్లది మనిషి పుటక కాదు...జంతుపుటకంటే అన్యాయం...' గిరి నోటి వెంబడి బూతులు కూడా వచ్చేసాయి గిరిగట్టిగా అరుస్తూనే వున్నాడు.

బస్సు ఒక స్టేజిలో ఆగింది. గిరి దిగవలసింది అక్కడే. కమల మెల్లగా సీట్లోంచి లేచింది, చాలా నీరసంగా వుంది. కళ్ళు తిరుగుతున్నట్లుగా అనిపించింది

గిరి గబగబా బస్సుదిగాడు. కమలని చూస్తూ' దిగు ... ఇంకా దిక్కులు చూస్తావేం?' గద్దించాడు.

కమల గుడ్ల నీరుపెట్టుకుంది.

'కళ్లు తిరుగుతున్నాయండి ?' దీనంగా అంది.

గిరి గబగబావచ్చి రెండుచేతులతో కమలని పట్టుకొని మెల్లిగా బస్సు దింపాడు.

బస్సు వెళ్లిపోయింది.

* * *

మరునాడు ఆఫీసుకు వచ్చి రావటంతోనే ప్రకాశం దగ్గరికి వెళ్లాడు గిరి.

జేబులోంచి పాతిక రూపాయలు తీసి ప్రకాశానికిచ్చాడు. 'ఈ డబ్బు ముకుందరావుకిచ్చెయ్. నిన్న ఇవ్వమని చెప్పాను కదా. అందుకే ఇవాళ నాకై నేను ఇవ్వడానికి మొహం చెల్లడం లేదు. నిన్న నేను అన్నదంతా మర్చిపొమ్మని చెప్పు.' అన్నాడు.

ప్రకాశం గిరివంక ఆశ్చర్యంగా చూస్తూ వుండిపోయాడు. ఏమిటీలా హఠాత్తుగా మారిపోయాడా ని.

అన్నా చెల్లెళ్ళ అనుబంధానికి అపురూపమైన దృశ్యకావ్యం



ప్రతాప్ ఆర్ట్ ప్రొడక్షన్స్







# చదువు-సంస్కారం

ఈస్ట్‌మన్ కలర్

నిర్మాత
**కె. రాఘవ**

కథ, మాటలు, పాటలు, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం
**రాజశ్రీ**

సంగీతం రమేష్ నాయుడు · కెమెరా మధుసూదన్ s.i.c.a. · ఎడిటింగ్ బాలు · ఆర్ట్ సి. హెచ్. ప్రసాద్ రావు

తారకరామా · నవభారత్ · శ్రీ తారకరామా

THAPAKARAMA

RamaRao Arts

# రాజీ

(11వ పేజీ తరువాయి)

ఆపిల్లకి నేను భర్తని అవుతాననికానీ అవాలని కానీ అనుకోలేదు. ఆపిల్ల నాకన్నా పద్నాలుగు సంవత్సరాలు చిన్నది. బలహీనంగా యెప్పుడూ ఏదో ఒక సుస్తీతో వళ్ళంతా కురుపులతో అనాకారిగా వుండే మైథిలి నాజీవిత సహచరి అయింది. దీనికి కారణం మాఅమ్మ. అక్క కన్నీళ్ళకి కరిగిపోయి అవసానదశలో నాదగ్గర వాగ్దానం తీసుకుని మరీ ప్రాణాలు వదిలింది. వైదేహీ అంతవరకూ నా వుద్రేకాలు వూహలూ అలా అలా తేలిపోతూండేవి. జీవితం అందమైందిగా కన్పిస్తూండేది వుత్సాహంతో వురకలువేస్తూ చదువు పూర్తిచేసి వుద్యోగాన్ని సంపాదించి యింక నచ్చిన పిల్ల కోసం అన్వేషిస్తూన్న సమయంలో నావూహలకి సంబంధం లేకుండా ఈ పెళ్ళి జరిగిపోయింది.

యిష్టంలేని పెళ్ళి యెందుకు చేసుకున్నావ్? యెందుకు చేసుకోవాలి? అని నన్నునేను ప్రశ్నించుకుని ఆలోచించీ ఆలోచించీ అలిసిపోయాను. మైథిలిని వదిలేసి మరోపెళ్ళి చేసుకుంటే వన్నెవరూ యేం చెయ్యలేరు. కానీ అమ్మకిచ్చిన మాటవల్లనో అమాయకురాలైన మైథిలికి వేసిన మూడు ముళ్ళ ప్రభావంవల్లనో నేను ప్రక్కదారుల్లో పడలేకపోయాను. కొన్నాళ్ళ ఆవేశం అశాంతీ నన్ను వుక్కిరిబిక్కిరి చేసినా నిగ్రహించుకుని ఆలోచించి ఒక నిశ్చయానికి వచ్చాను. వైదేహీ జీవితంలో ఒక్కోప్పుడు రాజీపడక తప్పదు. పడితీరాలి కూడా.

కాలేజీ రోజుల్లో ప్రేమలో పడ్డాను. కానీ ఆ అమ్మాయి నన్నుకాదన్నది. నేనక్కర లేదనుకున్న మైథిలి నాకాళ్ళకి చుట్టుకుంది. ఈ బంధం వదిలేది కాదు. అందుకే మనస్సులో రాజీపడి ఇల్లూ యింటికి కావల్సిన హంగులూ ఒక్కోటే అమర్చుకుంటూ క్షణం విశ్రాంతి లేకుండా ఏదో ఒకపనిలో మనస్సుని 'లగ్నం' చేసుకుని ప్రశాంతంగా బ్రతకాలని ప్రయత్నిస్తూన్నాను. ఈ సంఘర్షణలోనే చుట్టూ వుండే అందరికీ దూరంగా బ్రతకటం అలవాటుచేసుకున్నాను. దగ్గరైతే నా వివరాలు తెల్సుకుని పరిహసిస్తారేమో అని పిరికితనం. లేక సానుభూతి చూపినా సహించలేను.

ఈ మేడమీదకి అద్దెకి వచ్చిన తర్వాతే సాధ్వీమణితో పరిచయం. ఆవిడే కావాలని నా పరిచయం పెంచుకుంది. యెందుకో మాత్రం ఈ నాటికీ నాకు తెలియదు. ఆవిడ దగ్గర నేను కొన్నిరకాల వంటలూ యెంబ్రాయిడరీ కుట్టుపనీ నేర్చుకున్నాను. సాధ్వీమణి చాలా ఉత్తమురాలు. నాకు అప్తురాలు. ఆవిడ ఆత్మీయతలో నాకు శాంతి దొరుకుతుంది వైదేహీ. ఆత్మీయతా ప్రేమా వున్నచోటే ఈర్ష్యకి చోటు వుంటుందేమో! అందుకే నిన్ను అలా నొప్పించి వుంటుందనుకుంటాను. నీవూ నా ఆత్మీయురాలివి అయినావని గ్రహించి వుంటుంది.

ఆవిడదాంపత్యజీవితం బైటికి కన్పించేంత ఆదర్శంగా లేదు. అతను దురభ్యాసాలకి అలవాటుపడ్డాడని వాపోతోంది. ఈలాంటి విషయాల్లో మరొకరు యేం చెయ్యలేరు: యెవరి జీవితం వాళ్ళది. దాన్ని తీర్చిదిద్దుకోవల్సింది వాళ్ళవాళ్ళ చేతుల్లోనే వుంటుంది. పరిస్థితులని యెదిరించి అనుకూలపర్చుకోగల్గటం సామర్ధ్యం అవవచ్చు. కానీ పరిస్థితులు అనుకూలించనప్పుడు జీవితంలో రాజీపడటంకూడా విజ్ఞతే అనుకుంటాను.

మీ స్నేహితం నన్ను యెంతో ప్రభావితుడిని చేసింది కానీ ఒక స్త్రీకీ ఒక పురుషుడికీ 'స్నేహితం' యెన్నో రోజులు సాగటం కష్టం. యెందుకంటే చుట్టూవుండే సమాజం తప్పులు వెతుకుతూ అర్ధంలేని అభాండాలని వేస్తూ వుంటుంది. అని తెల్సినా మీకు దూరంగా వుండాలని ప్రయత్నించీ వుండలేకపోయాను. నాజీవితం యిదీ అని చెప్పాలని యెన్నోసార్లు ప్రయత్నించీ చెప్పలేకపోయాను. నాజీవితాన్ని గురించి యింకా చెప్తున్నాను వినండి.

పెళ్ళిఅయిన తర్వాత వుద్యోగం వూరు వచ్చి మళ్ళీ మా అక్కదగ్గరకి వెళ్ళలేదు.

అక్క యెన్నో వుత్తరాలు రాసింది. మొదటిరాత్రి వేడుక చేసుకుని మైథిలిని కాపురానికి తీసుకు వెళ్ళమని. కానీ నేను జవాబు రాయలేదు. తర్వాత నన్నునేను సంబాళించుకుని జీవితంతో రాజీకొచ్చి అక్కకి వుత్తరం రాశాను. మైథిలినియిక్కడికి పంపేసెయ్యమనీ నేను రాననీను. అక్క సంతోషంగా జవాబిచ్చింది మంచిరోజు చూసి తీసుకొస్తానని. నేనిలారాసి ఒకనెల అయింది. మైథిలి కొరకు యెదురు చూస్తున్నాను. ఈ చిన్న ఇల్లూ ఆ గృహిణి మీకూ సాధ్వీమణికీ విందు చేయాలని యెన్నెన్నో వూహల్లో తేలిపోతున్న నాకు అక్కదగ్గరనుంచి టెలిగ్రాం వచ్చింది మైథిలికి 'జ్వరం అనీ'. వెంటనే బయలుదేరి ఈవూరు వచ్చేశాను. డాక్టరుకి చూపాను. మైథిలికి టీ బీ అనీ, గుర్తించటం ఆలస్యం చేశారనీ అయినా ఫర్వేదు మంచిమందులు వాడాలనీ పూర్తి విశ్రాంతి కావాలనీ శానిటోరియమ్‌లో చేర్పించమనీ సలహాయిచ్చాడు. అక్షరాలా ఆయన చెప్పినట్లు చేస్తున్నాను. రెండునెలలు శలవుపెట్టాను వైదేహీ. యిప్పట్లో నేనక్కడికి రాగలనన్న ఆశలేదు. ఇదీ నా జీవితం. వైదేహీ పెళ్ళిలేకుండా వంటరిగా కాలం గడపటం కష్టం ఆడపిల్లకి నేను నీ ఆత్మీయుడిగా మంచి స్నేహితుడిగా యిచ్చే సలహా ఒక్కటే. నాఫ్రెండ్ ప్రభాకర్ నాగదికి వచ్చినప్పుడు చాలాసార్లు చూశారు కబుర్లు చెప్పారు గుర్తువుందిగా. అతను పట్టభద్రుడు కాకున్నా స్థిరమైన వుద్యోగం వుంది. మీరంటే ప్రేమవుంది. మీఅంగీకారం తెల్సితే పెళ్ళికి రెడీగా వున్నాడు. కట్నం అవుసరంలేదు. మీ తల్లిదండ్రులతో సంప్రదించి ఈ పెళ్ళికి నేనే పెద్దరికం వహిద్దాం అని యెన్నో కలలు కన్నాను కానీ అవకాశం లేదుకనుక మీకు రాస్తూన్నాను. అతను ధనవంతుడు కాకున్నా గుణవంతుడు.

వైదేహీ మీరు గెజెటెడ్ ఆఫీసర్ భర్తగా రావాలనీ మీ అందం చూసి వస్తాడనీ కలలు కంటూన్నారు. అవన్నీ జీవితంలో అందరికీ

---

**కలిమి లేములు**

— అవనిగడ్డ సూర్యప్రకాష్.

గుడిసెలో
మూల్గుతున్న లేమి
మేడలో
కులుకుతున్న కలిమిని

చూసి — చూసి
దానంత ఎదగాలని
వెర్రిగా కలలు కంటుంది —

కానీ —
ఆ కలిమి
ఉక్కు పాదాల క్రింద
తర తరాలుగా
తను నలిగిపోతున్నట్లు
ఈ లేమి కేమి తెలుసు ... ?

---

# 2 ఫోస్‌ఫోమిన్ టానిక్కులు...






## ఫోస్‌ఫోమిన్ ఐరన్

స్త్రీల కోసం ప్రత్యేకమైన
ఐరన్ టానిక్

ఫోస్‌ఫోమిన్ ఐరన్ ఆరోగ్యమైన ఎఱ్ఱని రక్తమును
పెంపొందించుటలో మరియు శక్తిని అధికము
చేయుటలో సహాయపడుటకు ఐరన్‌ను యిచ్చుటకు
అదనపు మూలము. స్త్రీల కోసం ప్రత్యేకమైన ఐరన్
టానిక్ అగు ఫోస్‌ఫోమిన్ ఐరన్‌ను రోజూ త్రాగండి.

## ఫోస్‌ఫోమిన్ విటమిన్

కుటుంబముల కోసం
ప్రత్యేకమైన విటమిన్ టానిక్

ఫోస్‌ఫోమిన్‌లో కుటుంబ
ఆరోగ్యమునకు ముఖ్యమైన
బి కాంప్లెక్స్ విటమిన్లు
మరియు మల్టిపుల్
గ్లిసరోఫాస్ఫేట్లు ఉన్నాయి.

కుటుంబము అంతటికి 2 **ఫోస్‌ఫోమిన్** టానిక్కుల వల్ల ఆరోగ్యము కలుగును

ఫోస్‌ఫోమిన్ టానిక్కులు ఆకలిని అధికము చేస్తాయి,
శక్తిని పెంపొందిస్తాయి మరియు దేహములో రోగనిరోధక శక్తిని కలిగిస్తాయి.

SQUIBB® SARABHAI CHEMICALS LIMITED

® ఇ.ఆర్. స్క్విబ్ & సన్స్ ఇన్‌కార్పొరేటెడ్ వారి రిజిష్టర్డ్ ట్రేడ్ మార్కుకు చిహ్నం. దీని లైసెన్స్‌డు ఉపయోగదారులు ఎస్‌సిఎల్.

Shilpi SC 8A/74 tel

అందిరావు వైదేహి. కాస్త ఆ కలలో నించి దిగివచ్చి ప్రపంచపు పోకడ గుర్తించి తల్లి దండ్రులని అర్థం చేసుకుని ఈ పెళ్లికి అంగీకరించటానికి ప్రయత్నించండి తప్పక వివాహం జరిగి తీరుతుంది. నేనూ రాగల్గితే తప్పక వస్తాను. ఏం! నా సలహా ఆలోచించి చూస్తారు కదూ!

వైదేహీ మనం ప్రేమించిన వాళ్లు దగ్గర కావటం కంటే మనని ప్రేమించేవాళ్లు దొరకటం ఒక విధంగా అదృష్టమేనేమో! మొదట అసహ్యించుకున్నా యిప్పుడు మన స్ఫూర్తిగా నా మైథిలిని తిరిగి పూర్తి ఆరోగ్యవంతురాలిని చెయ్యమని భగవంతుడిని ప్రార్థిస్తూన్నాను. యీసారికింక యింకేం రాయలేను. వైదేహీ నా అడ్రెస్ యిచ్చాను కదూ జవాబు రాస్తే సంతోషం.

యింతే

మూర్తి.

వైదేహి మళ్లీ మళ్లీ ఆ వుత్తరాన్ని యెన్నోసార్లు చదువుకుంది. మూర్తికి పెళ్లి అయిందా! అయింది అయింది. అన్నమాట ఆమె చెవుల్లో ప్రతిధ్వనిస్తోంది. అందం, చదువూ, వుద్యోగం, సామర్థ్యం వున్న

## రాజీ

యువకుడు జీవితంలో 'రాజీ' పడుతున్నాడు. కేవలం తల్లికిచ్చిన మాటకోసం. అక్క కూతురు కోసం యెంత విచిత్రం! మూర్తి గారూ మీరెంత నిండు గుండె కలవారు! నిన్ను దక్కించుకున్న మైథిలి అదృష్టవంతు రాలు నీవేకాదు నేనూ ఆ భగవంతుడిని వేడుకుంటాను మైథిలిని చల్లగా కాపాడమని.

కన్నీళ్లని పైట చెంగుతో తుడుచు కుంటూ వుండిపోయింది వైదేహి. రాత్రి పన్నెండింటి వరకూ ఆలోచించి ఆఖరుకి తండ్రికివుత్తరంరాసికవరు అంటించిమూర్తికీ వుత్తరంరాసి మళ్లీ మళ్లీ చదివి కవరు ప్రక్కన పెట్టి "మూర్తిగారు మీలా నేనూ జీవితంలో రాజీపడుతూన్నాను" అనుకుంటూ కళ్లు మూసుకున్నది. ఆలోచనల్లో అలా యెప్పటికో నిద్రలోకి జారిపోయిన వైదేహికి యెవేవో కలలు. ఆ కలల్లో పెళ్లి పూల పల్లకీలో వూరేగింపు. సన్నాయి శ్రావ్యంగా విన్పిస్తోంది. వైదేహి చిరునవ్వు నవ్వుతోంది నిద్రలోనే హాయిగా.

(అయిపోయింది)

## చీకటి తప్పులు

చీకటి చాటున వేగపు హద్దును అతిక్రమించే కారు డ్రైవర్లు, భవిష్యత్తులో తమని తాము శిక్షించుకొను ప్రమాదంలో పడిపోతారు. రోదసీ పరిశోధనా కార్యక్రమాల్లో నియోగింప బడిన శాస్త్రవేత్తలు, వారి పరికరము లలో ఒకటి చాలా ఉపయోగ పడగలదని సలహా యిచ్చారు. అట్టి పరికరము ప్రత్యేకమైన ఫ్లాష్ గన్ తో కలిపి ఉపయోగింపబడి నప్పుడు రాత్రులందు ఫొటోలు తీయగల కెమెరా దానిలో ఇన్‌ఫ్రా రెడ్‌ఫిల్మ్ ఉపయోగించబడు తుంది. ఈ ఫిల్మ్ ఉష్ణము వల్ల పృథక్కరింప బడుతుంది. వేగంగా కారును నడుపుచున్న డ్రైవరు ముఖ మును అతని చర్మము నుండి వచ్చు వేడిమివల్ల ఫొటో తీస్తుంది. దానిలో అతను ఉపయోగించిన కారు నెంబరు కూడా పడుతుంది. పోలీసులు ఆ ఫొటోను అతని నేరమును నిరూ పించుటకు ఉపయోగింతురు.

# చిగురించిన జీవితం

ముద్దంశెట్టి హనుమంతరావు

(గత సంచిక తరువాయి)

అప్పుడే శ్రీధర్, సీత, లోపలికి వచ్చారు. సీత అబ్బాయిని యెత్తుకుని వుంది.

"రండి. . రండి . . శ్రీధర్‌గారూ !" ఆహ్వానంగా ఆహ్వానించింది, విజయ.

శ్రీధర్‌ని, సీతని, చూసి శ్రీనివాస్ నీర్సైపోయాడు వాళ్లు మళ్ళీ తనకి తారసపడతారని, అతనేనాడూ వూహించలేదు· అతని మొహంలో కత్తి వేటుకి నెత్తురు చుక్క లేనట్లయింది. కళ్లల్లో యేదో భీతి దోబూచులాడింది. పెదాలు సన్నగా కంపిస్తున్నయ్. చేతులు వణికినయ్. చేతుల్లో అంతవరకూ పట్టుకున్న ప్రెజెంటేషన్ పేకెట్టూ, బుకే, క్రింద పడ్డాయి. సీతకేసి, ఆమె చేతుల్లో వున్న బిడ్డకేసి చూశాడు. అతనికి మతిపోయినట్లయ్యింది. కుమార్ విజయ, లత, శ్రీనివాస్‌లో కలిగిన మార్పుల్ని గమనిస్తూనే వున్నారు. క్రింద పడ్డ పేకెట్టు బుకేలను తీసి, టీపాయ్ మీద పెట్టాడు కుమార్.

శ్రీధర్‌కి, శ్రీనివాస్‌ని చూడంగానే ఆవేశం కట్టతెగి ప్రవహించింది. అయితే, ఆ పరిస్థితిలో ఆవేశం అనర్థానికి దారి తీయవచ్చునన్న సదుద్దేశంతో అంత ఉద్రేకాన్నీ దిగ మ్రింగాడు. హుందాగా నడుస్తూ ముందుకొచ్చి "హల్లో. . .శ్రీనివాస్. . ." అంటూ చెయ్యి చాచాడు.

శ్రీనివాస్‌కి తల కొట్టేసినంత పనయ్యింది. యాంత్రికంగా చెయ్యి కలిపాడు. ఆ చెయ్యి కంపిస్తూ వుండటం శ్రీధర్ అనుభూతిని పొందాడు.

విజయ, సీత దగ్గరున్న బాబుని తీసుకుని ముద్దులాడింది. సీతకి పరిస్థితి అయోమయంగా తోచింది ఆమెకి సుమారు ఏడుపొచ్చింది. శ్రీనివాస్ తనతో మాట్లాడక పోతే పోయె. . తన గురించి ఆసక్తి కనపర్చక పోతే పోయె. . కాని, బాబు విషయంలోనైనా కాస్తంత ఆసక్తి, కనబర్చక పోయేసరికి ఆమెకి దుఃఖం ముంచుకొచ్చింది. ముక్కూ మొహం తెలీని మనిషల్లే, అలా చూస్తూ వుండిపోయాడు శ్రీనివాస్. అదీ ఆమె బాధ.

"శ్రీనివాస్, శ్రీధర్‌గారితో నీకు బాగా పరిచయమున్నట్లుందే !"అంది విజయ.

"అవును విజయా! బాగా తెలుసు . ." మెల్లగా అన్నాడు. రాబోయే తుఫానుని యెలా తట్టుకోవడమా ఆలోచిస్తున్నాడు, శ్రీనివాస్.

"బావుంది. మరి వారి చెల్లెలయిన యీమెతో పరిచయం లేదా", సూటిగా అతని మొహంలోకి చూస్తూ ప్రశ్నించింది.

శ్రీనివాస్, కంగారుతో తబ్బిబ్బయ్యాడు. తన సమక్షంలోనే శ్రీధర్, సీత నుంచుని, ఉండగా కల్పిత విషయాలేం చెప్పగలడు? ఆ ధైర్యం లేక పోయింది.

"ఆఁ. . .ఆఁ. . పరిచయం లేకేం. . . వుంది." అంటూ నీళ్లు నమిలాడు, తడబడుతూనే.

"అట్లా తడబడుతున్నావేం శ్రీనివాస్? ఆమెతో పరిచయం వున్న వాడివైతే, ఆమెను పలకరించడం, సభ్యతకదా? నువ్వింత అసభ్యంగా ప్రవర్తిస్తావని నేనెప్పుడూ వూహించలేదు" మాటలతోనే చుర్రుమనిపించింది విజయ.

సమాధానం యేం చెప్పాలో, తనని తాను ఎట్లా సమర్థించుకోవాలో, శ్రీనివాస్‌కి అవగాహన కాలేదు. తను వూబిలో యిరుక్కున్నట్లు గ్రహించేశాడు.

కుమార్ అందుకున్నాడు.

"పలకరించడానికి మొహం చెల్లొద్దూ? ఏ మొహం పెట్టుకు పలకరిస్తాడు? ఆమెకి చేసిన ద్రోహం, సాక్ష్యంతో సహా కళ్లెదుట కనిపిస్తూ వుంటే, పలకరించే ధైర్యమెక్కడిది? ఇక, సభ్యత అంటావా? పై చదువులు చదువుకుని, సభ్యతా సంఘంలో జీవిస్తున్నాడేగాని, నిజానికి యితనిలో సభ్యతగాని, నిజాయితీ గాని, మానవత్వం గాని వెదికినా అగుపించవని, యిప్పుడు తెలుస్తోంది."అంటూ శ్రీనివాస్‌కేసి తిరిగి సభ్యతకి మారు పేరు వంచన కాదని, యిప్పుడైనా తెలుసుకో శ్రీనివాస్."అన్నాడు కటువుగా.

"ఈమెని వంచించినట్టే యిలా ఎంతమందిని వంచించాడో యేమిటో!" అంది, లత.

"నిజానికి నేను అదృష్టవంతురాల్ని. లేకపోతే నన్నూ మోసగించే వాడేమో!" తన సందేహాన్ని బైటపెట్టుకుంది విజయ.

*జరిగిన కథ 5:* డాక్టర్ రామరాజు యశోదమ్మల సంతానం శ్రీధర్, సీతలు. మెడిసిన్ చదివిన శ్రీధర్ ప్రయివేట్ డిస్పెన్సరీ ప్రారంభిస్తాడు. తనని ప్రేమించి, అమాయకంగా నమ్మిన సీతను పెళ్లి చేసుకొనటానికి సంశయించిన శ్రీనివాస్, ఆమె తల్లి కాబోతోందని తెలుసుకుని వెంటనే ఆ వూరినుంచి వెళ్లిపోతాడు. వంశగౌరవం నిలుపుకోవటం కోసం సీతతో సహా తలిదండ్రులను తీర్థయాత్రలకు పంపిన శ్రీధర్ తన ప్రాక్టీసును మద్రాసుకు మార్చేస్తాడు. హఠాత్తుగా విజయ అనే అమ్మాయితో శ్రీనివాస్‌ను చూచిన శ్రీధర్ ఆమెనికలుసుకుని శ్రీనివాస్ కపట ప్రవర్తన గూర్చి చెప్పగా అతనికి బుద్ధి చెప్పాలని తన నకిలీ పుట్టినరోజుకు ఆమె ఆహ్వానించగా శ్రీనివాస్ వస్తాడు.

ఆ రోజు వరకు, వాళ్ళందరి మధ్యా గౌరవప్రదమైన వాతావరణంలో మసలిన శ్రీనివాస్‌కి, వాళ్ళందరి మాటలు వింటుంటే, మాటల యీటెలతో తనని చిత్రవధ చేస్తున్నట్లనిపించింది. తను చేసిన పాపానికి, యెక్కడో పరలోకంలో కాదు— ఇక్కడే యీక్షణంలోనే శిక్ష అనుభవిస్తున్నట్లు ఫీలయ్యాడు. తనని తానోసారి తిరిగేసుకున్నాడు. గతాన్ని గుర్తుకు తెచ్చుకున్నాడు. సీతలాంటి వుత్తమురాల్ని, అమాయకురాల్ని, నమ్మించి మోసగించిన తనకి నిష్కృతి లేదనుకున్నాడు. గత్యంతరం లేకనే కావచ్చు. మానసికంగా కలిగిన పరిణామమే కావచ్చు. . అతనిలో పశ్చాత్తాపం కలిగింది. కళ్ళు చెమ్మగిల్లాయి.

అంతవరకూ మౌనంగా వున్న శ్రీధర్, శ్రీనివాస్ ఆలోచిస్తూండటాన్ని సహించలేక పోయాడు. అతను, యింకేదో ప్లాను వేస్తున్నాడేమోనన్న సందేహం కలిగింది. ఒకసారి మోసగించిన వ్యక్తిని ఎవ్వరూ యెప్పుడూ నమ్మరు, నిజానికి ఆ వ్యక్తిలో మార్పు వచ్చినా, అందుకే శ్రీధర్ శ్రీనివాస్‌ని సందేహించాడు. ఇంక కేవలం ప్రేక్షకుడిగా మౌనంగా వుండలేక పోయాడు.

"ఏమిటి శ్రీనివాస్, నీ ఆలోచనలు? నీ కపట నాటకానికి, యింకా తెరవేసే వుద్దేశం లేదా? నువ్వే అందరికంటే తెలివైన వాడివని, అందరినీ వంచించ గలవని అనుకోకు. అది యెన్నటికయినా యెదురు దెబ్బ తీస్తుంది. నువ్వు చేసిన తప్పు ఒప్పుకుని, సీతకి క్షమాపణ చెప్పుకో.' అన్నాడు, ఆవేశంతో.

విజయ మళ్ళీ అందుకుంది.

"శ్రీధర్‌గారు వుత్తములూ, వున్నత సంస్కారం గలవారు గాబట్టి, నీకు మరెట్టి అపకారమూ తలపెట్టలేదు శ్రీనివాస్. ఆయన కేవలం, తన చెల్లెలి సౌభాగ్యాన్ని, శ్రేయస్సునే ఆకాంక్షించారు. అందుకనే ఆత్మహత్యకు పూనుకున్న చెల్లెల్ని రక్షించుకొని, ఆమెలో జీవితమ్మీద ఆశను పునరుజ్జీవింపజేసి, నీ ప్రతిబింబమైన ఆమె బిడ్డను తన బిడ్డగా లోకానికి చాటి చెప్పి, తన సుఖ సంతోషాల్ని దూరం చేసుకున్నారాయన. చెల్లాయి పట్ల, అన్నయ్యకు గల వాత్సల్యానికి, మమతకు, శ్రీధర్‌గారి మనస్తత్వం ఒక గీటురాయి. అటువంటి వ్యక్తి సమక్షంలో నిలబడ్డానికి కూడా నీకు అర్హత చాలదు. అందుకే చెబుతున్నాను. . యింక నలుగురిలో పడక ముందే, మరో ప్రమాదమేదీ ముంచుకు రాకముందే. నీ తప్పును ఒప్పుకుని, ఆయన చెప్పినట్లు, ఆమెకి క్షమాపణ చెప్పుకో." అంది విసురుగా.

"అవును శ్రీనివాస్! నువ్వు క్షమాపణ చెప్పుకుని, ఆమెను స్వీకరించాల్సిందే. మరో మార్గం లేదు.

నీలాంటి ప్రేమికులు వుండబట్టే, పవిత్రమైన ప్రేమకు కొండొకచొ కళంకం వస్తోంది. విద్యావంతుల్లో నీవంటి వారూ వున్నారంటే, మాకే సిగ్గేస్తుంది. మరి ఆలస్యం చెయ్యకుండా ఆమెకిక్షమాపణ చెప్పుకో," ఖంగుమనే గొంతుతో అన్నాడు కుమార్

"ఇంకా ఆలోచిస్తావేం శ్రీనివాస్. మేం ఎవరం చెప్పకుండా నువ్వు చెయ్యాల్సిన పని అది. క్షమాపణ కోరుకో." విజయ మళ్ళీ రెట్టించి చెప్పింది.

శ్రీనివాస్‌కి మార్గాంతరం కనిపించలేదు. తప్పు చేసిన వ్యక్తి, తప్పించుకోలేడన్న సత్యాన్ని గ్రహించి సీతకు దగ్గరగా నడిచాడు. ఆమె రెండు చేతులూ పట్టుకున్నాడు. "నన్ను క్షమించు సీతా! నీకు నేను తీరని అన్యాయం చేసి, నా చదువుకీ, సంస్కారానికీ కళంకం తెచ్చుకున్నాను. నాలోని కపట బుద్ధికి యీ రోజుతో స్వస్తి చెబుతున్నాను. . ఎప్పటికీ నువ్వు నా అర్ధాంగివే. . క్షమించాసను. . " అన్నాడు పశ్చాత్తప్తుడై.

సీతకి, ఆ మాటలు తేనెసోనల్లా వినిపించాయి. తన జీవితంలో యీ శుభ ఘడియ మళ్ళీ వస్తుందో రాదో నన్న భీతితో, సంధిగ్ధతతో, యిన్నాళ్ళా కాలం గడిపింది. మవునంగా యేడ్చింది. ఆ రోజు వచ్చేసరికి, ఆమె మొహం ఆనందంతో ప్రఫుల్లమయ్యింది. సిగ్గుతో యెర్రబారింది. "ఛా! అవేం మాటలండీ? నేను క్షమించడమేవిటి? నేను మీ అర్ధాంగిని. . జరిగిందేదో జరిగి పోయింది. ఇటువంటి పీడకల, మళ్ళీ మన జీవితంలో రాకూడదు. ." అంది, భర్త మొహంలోకి అనురాగ పూరితమైన దృక్కుల్ని ప్రసరిస్తూ.

శ్రీధర్ మొహం వికసించింది. అతనికంటే అధికంగా సంతోషించింది విజయ. ఒక మంచి పని చేశానన్న తృప్తి, ఆమెని మురిపించింది.

"ఆమె చెప్పక పోయినా, మీ అబ్బాయి చెబుతాడు క్షమాపణ. . ఇదిగో. . వీణ్ణి తీసుకో ." అంటూ తన చేతుల్లో వున్న బాబుని శ్రీనివాస్‌కి నవ్వుతూ అందించింది, విజయ.

శ్రీనివాస్ బాబుని ఆప్యాయంగా చేతుల్లోకి తీసుకుని ముద్దాడాడు. సీత ఒళ్ళు పులకరించింది, సంతోషంతో.

శ్రీనివాస్, మెల్లగా శ్రీధర్ దగ్గరికి నడిచాడు. "శ్రీధర్, నన్ను నువ్వు కూడా క్షమించుతావు కదూ? ఇలా ఎందుకు జరిగిందో, కారణం చెప్పలేను. కాని, నా ప్రవర్తనకి నేను కుచించుకు పోతున్నాను" అన్నాడు పరితపిస్తూ.

శ్రీధర్, చిరునవ్వుతో శ్రీనివాస్ భుజమ్మీద తట్టాడు.

"ఇప్పటికయినా నీలో పశ్చాత్తాపం కలిగింది. అందుకు సంతోషిస్తున్నాను శ్రీనివాస్. నిజానికి, మా చెల్లాయి అదృష్టవంతురాలు. అందుకే, అనుకోకుండా నువ్వు విజయగారితో మాట్లాడుతూ నా కంటబడ్డావు. నిన్ను కలియకుండా, నువ్వు వెళ్ళిపోయాక, ఆమెను కలుసుకున్నాను. నీ విషయమంతా చెప్పాను. ఆమె నన్ను అర్థం చేసుకుంది. నా మాటల్ని విశ్వసించింది. సీత బ్రతుకును సరిదిద్దడానికి సంకల్పించుకుంది. నీవంటి వంచకులకు మోసంతోనే గుణపాఠం నేర్పాలనుకుంది.. ఈ ఏర్పాట్లన్నీ ఆమె చేసినవే! ఆమె సమయస్ఫూర్తికీ, సహృదయతకీ, నేనూ మా చెల్లాయి కృతజ్ఞత చెప్పుకోవాలి" అంటూ విజయకేసి చూశాడు శ్రీధర్.

విజయ, బిడియపడుతూ మొహం దించుకుంది.

"అబ్బే! కృతజ్ఞతలు ఎందుకండీ! తోటి స్త్రీ జీవితాన్ని సరిదిద్దడం, శ్రీనివాస్ లాంటి వంచకులకు బుద్ధి చెప్పడం, నా కర్తవ్యంగా, బాధ్యతగా గుర్తించి, యీ ప్రయత్నాలు చేశాను. ఇందులో మా అన్నయ్య సహకారమూ ఉంది.." అంది మెల్లగా,

"మీలాంటి సహృదయులు ఎంతమంది ఉంటారండీ ? నేను చెప్పిన విషయాల్ని మీరు నమ్మకపోతే, నేనేం చేసేవాణ్ణో చెప్పండి?"

"అప్పుడు నేనూ, సీతలా మోసపోయేదాన్నేమో




ఎవరు చెప్పగలరు? ఒక విధంగా మీరు నాకు సహాయం చేశారు. నేనే కృతజ్ఞత చెప్పుకోవాలి" అంది విజయ.

బైట, కారాగిన చప్పుడయింది. విజయ నిర్ఘాంతపోతూ, అన్నయ్యకేసి చూసింది. కుమార్ ఏం జరిగితే జరగనీ, వూరుకోమన్నట్లుగా సౌంజ్ఞ చేశాడు. అంతలోనే రంగనాథం లోపలికి వచ్చాడు. నాన్న ఎప్పుడూ లేనిది, యీవేళ ఎందుకీ సమయంలో వచ్చారో విజయకి అర్థంకాలేదు. లోలోపల కంగారుపడుతున్నా, గంభీరంగా వూరుకుంది.

రంగనాథంని చూస్తూనే, శ్రీధర్ విస్తుపోయాడు. ఆ రోజు రంగనాథంగారి నేమ్ ప్లేటు చూసి, తాను సందేహించాడు. ఇప్పుడు తన సందేహమే నిజమయ్యింది.

"నమస్కారం రంగనాథంగారూ!" అన్నాడు శ్రీధర్.

ఈసారి ఆశ్చర్యపోవడం, కుమార్, విజయల వంతయ్యింది.

"నమస్కారం... మీరిలా వచ్చారేమిటి డాక్టరు గారూ?" అంటూ దగ్గరగా వచ్చాడు, రంగనాథం.

"శ్రీధర్ గారూ, మా నాన్నగారు మీకెట్లా తెలుసునండీ?" ప్రశ్నించింది విజయ, యేమీ అర్థంగాక.

"రంగనాథంగారు మీ నాన్నగారని ఇప్పుడే తెలుసుకున్నానండీ. కాని, ఆయన ఒకప్పుడు నా పేషెంటు... ఆ విధంగా పరిచయం..." జవాబిచ్చాడు, శ్రీధర్.

రంగనాథం చప్పున ప్రస్తావన మార్చాడు. "అది సరేగాని డాక్టరుగారూ, మీ చంటాడ్ని తీసుకువచ్చారా? పాపం, మీకు చాలా ఇబ్బందండీ!" అన్నాడు, రంగనాథం.

విజయ, ఫకాల్న నవ్వింది.

"అదేమీ టమ్మాయ్ అలానవ్వుతావు ?" అన్నాడు రంగనాథం.

"కాకపోతే మరేవిటి నాన్నా? ఆ చంటాడు ఈయన కొడుకు కాదు, అసలు, ఈయనకి వివాహమే కాలేదుట. వీళ్ళ చెల్లాయి అదిగో అటు చూడండి... ఆ అబ్బాయి ఆమె కొడుకు. శ్రీనివాస్, అబ్బాయి తండ్రి. ఈ మిష్టరీని ఇంతవరకూ రహస్యంగా ఉంచడానికే శ్రీధర్‌గారు అభూతకల్పనలు చేసి, ఆ చంటాడ్ని తన కొడుకుగా లోకానికి చెప్పారుట' వివరించింది క్లుప్తంగా.

"వాట్ ! శ్రీనివాస్ ఆ చంటాడి తండ్రా ?" అంతా అయోమయంగా ఉందే! అయితే, డాక్టరు గారూ, నాతో అబద్ధం చెప్పారన్నమాట" సీరియస్‌గా అన్నాడు, రంగనాథం.

శ్రీధర్, ఎంతో బాధపడాడు.

"క్షమించండి సార్! పరిస్థితుల దృష్ట్యా అబద్ధం చెప్పక తప్పిందికాదు" ఖిన్న వదనంతో అన్నాడు.

"అబద్ధం చెప్పినందుకు, శిక్ష ఏమిటో తెలుసా?" గంభీరంగా అన్నాడు రంగనాథం.

"చెప్పండి. ఇప్పుడు మీరు ఏ శిక్ష విధించినా, భరించడానికి సంసిద్ధుణ్ణే. నాకిప్పుడు బాధ్యతల్లేవు. స్వేచ్ఛా జీవిని..." జవాబిచ్చాడు, శ్రీధర్.

"మీరు మా విజయని వివాహం చేసుకోవాలి. నా అల్లుడు డాక్టరై వుండాలన్నది నా చిరకాల వాంఛని ఆ రోజు మీ ఇంటికి వచ్చినప్పుడు చెప్పాను, గుర్తుందా?"

శ్రీధర్ మొహం విప్పారింది.

"బాగా గుర్తుంది సార్ ! మీ అమ్మాయి విజయని సంతోషంగా స్వీకరిస్తాను అర్ధాంగిగా. నాకు సంబంధించినంతవారకూ బాగానే వుంది. కాని, ఆమె అంగీకరించాలికదా" అంటూ విజయకేసి వోరగా చూశాడు, శ్రీధర్.

విజయ నిరాకరిస్తుందా? అబ్బే ! శ్రీధర్‌ని కలుసుకున్న క్షణం నుంచీ, అతని పట్ల సదభిప్రాయం ఏర్పడింది. అతని మనస్తత్వం తెలుసుకున్నాక, అతనే తనకి తగిన వరుడనిపించిందామెకి... ఇప్పుడు తండ్రే ఆ ప్రస్తావన తీసుకొచ్చేసరికి, ఆమెకి సిగ్గు దొంతరలు ముంచుకొచ్చాయి. బయటికి చెప్పలేని భావాల్ని వ్యక్తం చేస్తున్నట్లుగా, మొహం ప్రక్కకి తిప్పుకుని నవ్వుకుంది లోలోన.

రంగనాథం, కూతురి అభిమతాన్ని అర్థం

# మీకోసం మా విమాన సర్వీసులన్నీ తిరిగి ప్రారంభింపబడ్డాయి!



## యూరోప్

**యూరోప్‌కు వారానికి 11 సర్వీసులు**

మా '747' విమానాలు మళ్ళీ లండన్‌కు వారానికి 8 సార్లు, ఫ్రాంక్‌ఫర్ట్‌కు 4 సార్లు, రోమ్, పారిస్‌లలో ఒక్కొక్క చోటుకూ 5 సార్లు, జెనీవాకు ఒకసారి పయనిస్తున్నాయి. అంతేకాదు, మా '707' విమానాలు మళ్ళీ వారానికి రెండు సార్లు మాస్కోకు ఒక్కొక్కసారి జెనీవా, లండన్‌లకు పయనిస్తున్నాయి.



## న్యూయార్క్

**న్యూయార్క్‌కు వారానికి 7 సర్వీసులు**

మా '747' విమానాలు రోజుకు ఒకసారి, వారంలో ప్రతి రోజూ, మధ్య ప్రాచ్యదేశాలు మరియు యూరోప్ గుండా పయనిస్తున్నాయి. మా ఎక్స్‌కర్షన్ టికెట్టు ఖరీదుపైన మీరు పయనిస్తుంటే, రాకపోకలకు మీకు ఒకసారి వెళ్ళేందుకయ్యే ఖరీదు కన్న తక్కువే పడుతుంది.



## మధ్యప్రాచ్యదేశాలు

**మధ్యప్రాచ్య దేశాలకు వారానికి 18 సర్వీసులు**

కువెయిట్, బీరూట్‌లలో ఒక్కొక్క చోటుకు 5 సర్వీసులు, దుబాయ్, బెహరెయిన్‌లలో ఒక్కొక్క చోటుకు 3 సర్వీసులు, అబూ ధాబి, థహరాన్, టెహరాన్‌లలో ఒక్కొక్క చోటుకు 2 సర్వీసులు, అంతేగాక ఏడెన్, మస్కట్, దోహా, కెయిరోలలో ఒక్కొక్క చోటుకు వారానికి ఒక సర్వీస్ ఉన్నాయి.

**అంతేగాకుండా, ప్రతివారం**

**తూర్పు ఆఫ్రికాకు**
**3 సర్వీసులు**

**దక్షిణ పూర్వ ఆశియాకు**
**10 సర్వీసులు**

**జపాన్‌కు**
**6 సర్వీసులు**

**మోరిషస్‌కు**
**2 సర్వీసులు**

**ఆస్ట్రేలియాకు**
**2 సర్వీసులు**

**ఎయిర్-ఇండియా**

# చిగురించిన జీవితం

చేసుకున్నాడు. అయినా, ఆమె మనసులో ఏముందో తెలుసుకోవడం తాను చూడాలి... అనుకున్నాడు.

"ఏవమ్మా విజయా, ఈ డాక్టరుగారిని వివాహం చేసుకోవటం నీకు సమ్మతమేనా?" అడిగాడు మెల్లగా.

అవునన్నట్టుగా తలూపుతూ, రెండు చేతులతో, మొహం కప్పేసుకుంది సిగ్గుతో. ఆ క్షణంలో, ఆదో వింత అనుభూతి.

రంగనాథం ముసి ముసిగా నవ్వుకొన్నాడు.

"అయితే మరింకేం? నా కోరిక తీరినట్టే:" అంటూ శ్రీధర్‌తో "మీ నాన్నగారితో మాట్లాడతానని చెప్పండి డాక్టర్ " అన్నాడు.

"అల్లాగేనండీ" ఆనందంతో ఉక్కిరి బిక్కిరై పోయాడు, శ్రీధర్. తన జీవితంలో ఇది వూహించని పరిణామం .. అనుకున్నాడు.

"కంగ్రాచ్యులేషన్స్ శ్రీధర్.." అన్నాడు శ్రీనివాస్ "విజయా నీకూను".

"థాంక్స్..." ఇద్దరూ ఒకేసారి కృతజ్ఞత చెప్పుకున్నారు.

విజయ, తనకి వదినె కాబోతున్నందుకు సీత మురిసిపోతూ ముసి ముసి నవ్వుకుంది.

ఇది ఇలా వుండగా, విజయకి ఒక విషయం ఇంకా అర్థంకాలేదు. ఏ రోజు కూడా యీ సమయంలో ఇంటికి తిరిగిరాని నాన్న, ఆ రోజు ఎందుకొచ్చారో, ఎంత ఆలోచించినా అంతుచిక్కలేదు. కారణం ఏదో వుంటుందని ఆమె వూహించింది. అదే తెలుసుకోవాలనుకుంది

"నాన్నా, నాకో సందేహం. .?" అంది.

"ఏమిటో.. ?" వింతగా చూశాడు కూతురు కేసి రంగనాథం. ఈ పెళ్లికి ఇంకేమైనా షరతులు పెడుతుందేమోనని సందేహించాడు.

"ఏనాడు కూడా, యీ సమయంలో ఇంటికి రాని మీరు, ఈ రోజే ఎందుకొచ్చారు నాన్నా? నిజం చెప్పండి .." నవ్వుతూనే అడిగింది.

రంగనాథం, సంతృప్తిగా నవ్వేడు.

"నీ మస్తిష్కం చాలా చురుకైనదమ్మా విజయా! ఇక్కడున్న మీ అన్నయ్య కూడా ఆ ప్రశ్న వెయ్యాలని తట్టలేదు. నువ్వు ప్రశ్నించావు. నువ్వూహించినట్టు, కారణం వుండే వచ్చానమ్మా!" అంటూ క్షణం ఆగి గొంతు సవరించుకున్నాడు.

అందరూ ఆసక్తితో, ఆయన చెప్పబోయే దానికై ఎదురు చూస్తున్నారు. రంగనాథం ప్రారంభించాడు.

"శ్రీనివాస్ విషయం. మీ అన్నయ్యా, నువ్వూ, మాట్లాడుకోవడం విన్నానమ్మా! అప్పుడు నాకు నిజం తెలిసింది డాక్టర్ శ్రీధర్‌కి వివాహం జరగలేదనీ, అతని కొడుకుగా చెలామణి అవుతున్న అబ్బాయి, అతని చెల్లెలికీ, శ్రీనివాస్‌కీ పుట్టిన వాడనీ. కొద్ది రోజుల క్రితం నా ఒంట్లో సుస్తీ చేసింది జ్ఞాపకముందిగా? రోజూ డాక్టర్ శ్రీధర్ గారి దగ్గరికి వెళ్లి మందులూ, ఇంజక్షన్లూ తీసుకునేవాణ్ని. నా ఆరోగ్యం కుదుటబడింది. అప్పట్నుంచే అతని పట్ల నాకో విధమయిన అభిమానం ఏర్పడింది. నీకు, కాబోయే భర్త, డాక్టరయి వుండాలన్న ఓ కోరిక నాలో యెప్ప

ట్నుంచో వుంది. శ్రీధర్‌గారు నాకు నచ్చారు. అందుకే, ఓ రోజు వాళ్లింటికి స్వయంగా వెళ్ళి నిన్ను, శ్రీధర్‌కి చేసుకోమని, వాళ్ళ నాన్నగారిని కోరాను ఆ ముసలాయన ఎంతగానో బాధపడుతూ, చెప్పిందేమిటంటే, శ్రీధర్‌కి వివాహం జరిగిందని, అతని భార్య ప్రసవ సమయంలో బిడ్డని కని, కళ్ళు మూసిందని, ఆ బిడ్డ వారి దగ్గరే పెరుగుతున్నాడని, వివరించి చెప్పి, ఆ పరిస్థితులలో, నిన్ను ఆ ఇంటి కోడలిగా పంపడానికి నేను అంగీకరిస్తే, తనకేం అభ్యంతరం లేదన్నారాయన. కాని, చూస్తూ, చూస్తూ, అటువంటి వాతావరణంలోకి నిన్నెలా పంపగలనమ్మా? అందుకే నా ప్రయత్నాన్ని విరమించుకున్నాను. నీ మాటలు విన్నాక, నాలో ఆశాజ్యోతి మళ్లీ వెలిగింది. నీ పథకంలో నువ్వు ఓ ముఖ్య విషయం మర్చిపోయావు..." నవ్వుతూ ఆగాడు.

"ఏమిటి నాన్నా?"

"దూరమైన ఆ భార్యాభర్తల్ని కలిపావు. అంతవరకూ బాగానే ఉంది. కాని, శ్రీనివాస్‌లాంటి చంచల మనస్కుడు యెప్పుడు ఏం చేస్తాడో



వూహించలేంకదా! అతణ్ని ఓ కట్టుబాట్లో ఉంచే పద్ధతిని విస్మరించావు. దానికి నీ అనుభవం చాలిందికాదు. అందుకని, మీ ప్రయత్నంలో నేనూ ఒక భాగస్వామిని కావల్సి వచ్చింది. ఇవ్వాళ మధ్యాహ్నం టేప్ రికార్డర్ ఏర్పాటు చేసి, రిసీవర్ని టీపాయ్ క్రింద పెట్టాను" అంటూ ముగించాడు రంగనాథం.

"అయ్యగారూ! తమరు చెప్పినట్టే చేశానండీ!" అంటూ ప్రక్క గదిలోంచి బైటికొస్తూ అన్నాడు, వంటవాడు.

అందరూ విస్మయంతో ఒకరి మొహాలొకరు చూసుకున్నారు. ఈ ఆలోచన తట్టనందుకు, విజయ తననితాను నిందించుకుంది.

"రంగనాథంగారూ! వయస్సుకి ఎప్పుడూ విలువుందండీ! మీకు మా హృదయపూర్వక కృతజ్ఞతలు" అన్నాడు శ్రీధర్.

"అందులో నా స్వార్థం కూడా ఉందిలెండి డాక్టరుగారూ!"

"ఏమిటండీ ?"

"ఇంకేమిటండీ! మా విజయని వివాహం చేసుకొందుకు మీ అంగీకారం కూడా రికార్డు అయ్యిందిగా" నవ్వుతూ అన్నాడు, రంగనాథం.

అందరూ నవ్వేశారు.

"అన్నయ్యా ఇంక పార్టీ ఏర్పాట్లు కానీయ్... అంతా సవ్యంగా సాగిపోయింది.... "రియల్లీ ఇటీజ్ ఏ హేపీడే" అంది హుషారుగా, విజయ.

"హేపీ బర్త్ డే టు యు..."అన్నాడు, శ్రీనివాస్.

"బర్త్‌డే లేదూ... గీర్త్‌డే లేదు... నా బర్త్‌డే మరో నాలుగు నెలలకొస్తుంది..." నవ్వింది.

"అంటే, ఇదంతా..."తెల్లబోయాడు, శ్రీనివాస్.

"నాటకం... నీ నిజరూపం బైటపెట్టడానికి ఏర్పాటుచేసిన నకిలీ పుట్టిన రోజు..."

అందరూ మళ్ళీ నవ్వేరు... శ్రీనివాస్ కూడా నవ్వకుండా ఉండలేకపోయాడు. సీతకేసి చూస్తూ.

"టేప్ రికార్డరు ఆప్ చెయ్యరా!" అంటూ కేకేశాడు, రంగనాథం..

రేడియోలోంచి మధురమైన ప్రేమగీతం వినిపిస్తోంది.

పార్టీ సన్నాహాలకు కుమార్ కదిలాడు. అతని వెంట శ్రీధర్, శ్రీనివాస్ కూడా వెళ్ళారు.

## 16

రంగనాథం, డాక్టర్ శ్రీధర్‌ని అల్లుడిగా పొందినందుకు, అమితానందాన్ని పొందాడు. అతని కోడలిగా చేసుకున్నాడు. జీవితంలో ఇంక అతను కోరుకొనేది ఏమీ లేదు. సరదాగా, నిశ్చింతగా శేష జీవితాన్ని గడపడమే!

ఓ రోజు రంగనాథం, డాక్టర్ శ్రీధర్ ఇంటికి వెళ్ళాడు వాళ్ళందర్నీ చూసిరావాలని. శ్రీధర్ కన్సల్టింగ్ రూమ్‌లో బిజీగా ఉన్నాడు. రామరాజు డ్రాయింగ్ రూమ్‌లో కూర్చుని, ఏదో చదువుకొంటున్నాడు. రంగనాథంని చూడగానే పుస్తకాన్ని టీపాయ్ మీద పడేసి, ఆప్యాయంగా ఆహ్వానించాడు.

"రండి బావగారూ! కూర్చోండి".

రంగనాథం, వియ్యంకుడికి అభిముఖంగా ఆసీనుడయ్యాడు.

"ఏమిటో దీక్షగా చదువుతున్నారు...?"నవ్వుతూ అన్నాడు, రంగనాథం.

"వూరికనే యెప్పుడూ కూచోను బావగారూ! ఏదో ఒకటి చదువుతూ ఉంటాను. ఈ మధ్య మనసు బాగులేక, చదువు పట్ల ఆసక్తి ఉండేదికాదు. పుస్తకం తెరిస్తే చాలు— అమ్మాయి జీవితం ఆలోచనకి వచ్చేది. ఆ పుస్తకాన్ని మూసేసేవాణ్ణి. ఏదో మీ అందరి ఆశీర్వాదబలం వల్ల, దాని జీవితం కుదుటపడింది. మా వంశ గౌరవం నిలబడింది. ఇంక నాకు యే చింతా లేదు. అందుకే మళ్ళీ చదువులో పడ్డాను".

"ఏమిటోనండీ బావగారూ! మనం అనుకున్నవన్నీ అనుకున్నట్టుగానే జరిగిపోవు. ఏది, ఎలా జరగాల్సి ఉందో, అలాగే జరిగి తీరుతుంది. దాన్నే మనం 'విధి' అంటాం... విధి చేతుల్లో మనం కీలుబొమ్మలమే అనుకోండి... ఆఁ ... అమ్మాయి లోపలున్నట్టుంది..." అన్నాడు, రంగనాథం.

"విజయా! ఇలా రా అమ్మా! మీ నాన్నగారొచ్చారు." అంటూ కేకవేశాడు, రామరాజు.

విజయ క్షణంలో వచ్చేసింది. ఆమె బాబుని యెత్తుకుంది.

# చిగురించిన జీవితం

"ఏం నాన్నా! ఇప్పుడే వచ్చావా?" అంది.

"అవునమ్మా! ఈ భడవతో నీకు బాగా ఊసు పోతున్నట్టుంది" నవ్వుతూ అన్నాడు, రంగనాథం.

"అవును నాన్నా! ఇంటి పనంతా అత్తగారూ, సీత చూసుకుంటున్నారు... నన్ను యేపనీచెయ్యనివ్వరు అందుకే, బాబుని ఎత్తుకుని తిప్పుతూ ఉంటాను.."

"మంచిదేలేవమ్మా! మా అల్లుడు కన్సల్టింగ్ రూమ్‌లో బిజీగా ఉన్నట్టున్నాడు. మరి, శ్రీనివాస్ కాలేజీకి వెళ్ళాడా?"

"అవున్నాన్నా! విడిగా ఇల్లు చూసి కాపరం పెడతానంటున్నాడుగాని, కొద్ది రోజులపాటు ఇక్కడే ఉండమని మీ అల్లుడుగారు చెప్పారు..."

"అదీ నిజమే లే! కొద్ది రోజులపాటు, మన మధ్య ఉండటమే శ్రేయస్కరం. అయినా, ఇప్పుడు మరింకే వేషాలు వెయ్యడులే! ఒకసారి నలుగుర్లో అవమానం పొందాడుగా! పైగా మన చేతుల్లో ఆ టేపు ఉన్నంతవరకూ, మోసానికి సాహసించ లేడు. ఆ అవసరం మరి ఉండకపోవచ్చునన్నే..."

"నమస్కారం మామయ్యగారూ" లోపల్నించి కాఫీ తెస్తూ అంది, సీత.

"రా అమ్మా! కులాసాయేనా?" ఆమె అందించిన కాఫీ తీసుకుంటూ, అన్నాడు, రంగనాథం.

"కులాసాయేనండీ! మీ అందరి ఆశీర్వాదం వల్ల వాడిపోయిన నా జీవితం మళ్ళీ చిగురించింది" తృప్తిగా చిరునవ్వు నవ్వుతూ అంది, సీత.

"అది, నీ అదృష్టమమ్మా! అంతేకాదు నీ సమస్యతోపాటు, నా సమస్యా పరిష్కృతమయింది" కాఫీ సిప్ చేస్తూ అన్నాడు రంగనాథం.

క్షణం నిశ్శబ్దం తరువాత ఖాళీ కప్పు టీపాయ్ మీద పెడుతూ, మళ్ళీ రంగనాథమే అన్నాడు.

"అన్నట్టు, ఇవ్వాళే పిక్చరు మారింది మా హాల్లో. కారు పంపుతాను. మీరందరూ వచ్చేయండి. వింటు న్నావుకదమ్మా విజయా?"

"విన్నాన్లే నాన్నా! అందర్నీ తీసుకొస్తాను..."

రంగనాథం లేచాడు.

"బావగారూ మీరూ రావాలి... మరి, వెళ్ళొస్తా" అంటూ నిష్క్రమించాడు.

"అమ్మాయ్ విజయా, ఇట్లాగే మనమందరమూ, సమిష్టిగా ఒకే కుటుంబంలా కలిసిమెలిసి ఉండటంలో ఎంత ఆనందం ఉందో, చూశావా! కలకాలం మనం ఇలాగే ఉండాలమ్మా!" రామరాజు తృప్తిగా అంటూ, "ఏదీ ఆ భడవని ఇలా ఇవ్వు. ఆ స్వచ్ఛమైన బోసి నవ్వు చూస్తేనే మనశ్శాంతి కలిగినట్టుంటుంది..." అని కోడలి చేతుల్లో ఉన్న బాబుని తీసుకుని లాలించడం ప్రారంభించాడు.

సీత, విజయ, ఆ తాతమనవడ్ని చూస్తూ, నిండుగా నవ్వుకున్నారు లోలోన.

(అయిపోయింది)

**statement about ownership and other particulars about newspaper.**

**ANDHRA SACHITRA VARA PATRIKA**

**FORM IV (SEE RULE 8)**

**1. Place of publication:** Vijayawada

**2. Periodicity of its publication:** Weekly

**3. Printer's Name -** Sri S. Nageswara Rao
Whether citizen of India: Yes
Address: 16, Luz Avenue, Mylapore, Madras-4.

**4. Publisher's Name:** Sri S. Nageswara Rao
Whether citizen of India: Yes
Address: 16, Luz Avenue, Mylapore, Madras-4.

**5. Editor's Name:** Sri S. Radhakrishna
Whether citizen of India: Yes
Address: 16, Luz Avenue, Mylapore, Madras-4.

**Names and addresses of Individuals who own the newspaper and partners or share holders - holding more than one percent of the total capital:**

| NAMES | ADDRESSES |
|---|---|
| 1. Mr. S. Radhakrishna, | 16, Luz Avenue, Mylapore. Madras-4 |
| 2. Mrs. S. Kamakshamma | Do |
| 3. Mr. S. Nageswara Rao | Do |
| 4. Mrs. S. Rajeswari | Do |

**I, S. Nageswara Rao, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.**

**S. NAGESWARA RAO**
**1-3-75. Signature of Publisher.**

# ఫాలాక్షుని డైరీ

## సహాయానికి రాని పోలీసు.

నార్త్ శిహారుకు చెందిన అనేక ప్రాంతాలనుంచి డియోఘర్ పుణ్యక్షేత్రాన్ని సందర్శించడానికి వెళుతున్న నాలుగు వందల మంది యాత్రీకులు 7 వ తేదీ రాత్రి మాన్‌ఫిర్‌కు చెందిన వో స్కూల్లో పడుకున్నారట. అర్ధరాత్రి సాయుధులైన వో ముప్పయి మంది గూండాలు వారి మీద పడి, డబ్బు, పక్కబట్టలు, నగలు, వాచీలు, ఆహారం, ఆహారసామగ్రి కట్టుకున్న బట్టలు తప్ప అన్నీ దోచుకు పట్టుకు పోయారట. ఈ దోపిడి జరుగుతుండగా వాళ్ళు ఎన్ని కేకలు వేసినా కూతవేటు దూరంలో వున్న పోలీసు స్టేషను నుంచి గాని, చుట్టు పక్కల యిళ్ళనుంచిగాని, ఒక్కమనిషి సహాయానికిరాలేదని ఆ యాత్రీకులన్నారట.

## సామూహిక వివాహాలు

ఫిబ్రవరి ఎనిమిదో తేదీన 'సియోల్'లో ఒకేసారి పద్నెనిమిది వందల జంటలకు వివాహాలు రివరెండ్ మయంగ్ మూన్ ఆధ్వర్యంలో జరిగాయట. 20 దేశాలకు చెందిన యువతీ యువకులట వీరు. కొరియా, జపాన్, అమెరికా, బ్రిటన్, వెస్ట్‌జర్మనీ, ఫ్రాన్స్, నెదర్లాండ్స్, ఇటలీ, స్వీడన్, నార్వే, బెల్జియం వంటి దేశాల నుంచి యీ జంటలు వచ్చారట. ప్రపంచంలో వున్న క్రైస్తవ మతాలలో భేదం లేదని, క్రైస్తవులందరూ ఒకటేనని, చర్చిలన్నీ ఒకటేనని బోధించే "యూనిఫికేషన్ చర్చ్" అనే దాని స్థాపకుడట మయంగ్ మూన్‌గారు. అయితే జపాన్ టోక్యోలో ఆ రకం వివాహం చేసుకున్న పిల్లల తలిదండ్రులు కొందరు దీనిని వ్యతిరేకిస్తూ తమ ఆక్షేపణలు తెలిపారట. సో వాట్ !

## వధువుల అమ్మకం ?!

బంగ్లాదేశ్‌నుంచి ఆడపిల్లలను తెచ్చి, బొంబాయిలో "వివాహానికి" అమ్ముతున్న ఆరుగుర్ని బొంబాయి పోలీసు పట్టేసిందట. బంగ్లాదేశ్‌కు చెందిన ఆడపిల్లలను వీరు బొంబాయి తీసుకువచ్చి, మంచి వరులకిచ్చి పెళ్ళి చేస్తామని ఆశ పెట్టి డబ్బుకు అమ్మేస్తున్నారట, పోలీసు పట్టుకుని విడిపించిన ఆడవారిలో ముగ్గురు అమ్మాయిలు "పెళ్ళి"కి అమ్ముడు పోయినవారట.

• • •

ఒంగోలు ఎ. బి. మిషన్ జూనియర్ కాలేజీలో రెండో సంవత్సరం ఇంటర్మీడియట్ చదువుతున్న 18 ఏళ్ళ చప్పిడి సుబ్బారావు అనే విద్యార్థి ఫిబ్రవరి ఒకటో తేదీన కందుకూరులో "ఖో—ఖో"ఆటల పోటీలో ఆడుతూ ఆడుతూ చనిపోయాడట.

## లంఖణం పరమౌషదం.

కొవ్వు బాగా పెరిగి, లావై పోయినవారు ఆ కొవ్వు కరిగి, ఆరోగ్యవంతులవాలంటే విధిగా వారానికో రోజు సంపూర్ణంగా ఆహారం మాని వెయ్యాలనీ, ఆ రోజుకేవలం మూడు లీటర్ల ద్రవపదార్థం మాత్రమే సేవించాలనీ, "ఉమే"కు చెందిన డాక్టర్ డిచూనెట్ గారన్నారట. యాభైయ్యేళ్ళు దాటిన ఆడవారిలో, కొవ్వు శాతం యాభై వుంటోందనిఅన్నారట.

## ఎక్కువ పళ్ళు దంతక్షయానికి కారణమా ?!

దంతక్షయాన్నుంచి పళ్ళను కాపాడుకోడానికి లండనుకు చెందిన డాక్టర్ ఆర్. వైట్‌గారో వింత సూచన చేశారట. గట్టి ఆహారాన్ని, యీ నాడంత నాగరికం కాని ఆహారాన్ని తినడానికి మన పూర్వీకులకు ముప్పయి రెండు పళ్ళూ అవసరపడేవనీ, యీ నాడసలు మెత్తని, నవనాగరికమైన పదార్థాల్ని తినడానికి అన్ని పళ్ళు కేవలం అనవసరమనీ, మహా అయితే యిరవయ్యో, యిరవైనాలుగో పళ్ళుంటే చాలనీ ఆయనన్నారట. పాతికకన్నాపళ్ళసలు పుట్టకుండా చిన్న పిల్లలపుడే విజ్ఞానశాస్త్రం తగు చర్య తీసుకోవచ్చుని, ఎక్కువ పళ్ళు లేకపోతే యీ దంతక్షయమే రాదనీ ఆయనన్నారట. బాగుంది భార్యకు విడాకులివ్వడమే వుత్తమమైనకుటుంబ నియంత్రణ పథకం అన్నట్టు లేదూ !

## హిప్పీయిజం పరువుతక్కువా !

మెడ మీదుగా దిగి భుజాల మీద స్థిరపడే క్రాపు, చెవిని మూసుకుంటూ క్రిందకివెడల్పవుతూ దిగి, చంపంతా ఆక్రమించే సైడ్ బరన్స్, పై పెదిమ మీదుగా ప్రయాణం చేసి, పెదిమతో క్రిందికి దిగి గెడ్డం వరకు వంగి పోయే మీసాలు బుల్లి బుల్లి గెడ్డాలు, ఋషివారిలాంటి (అసహ్య) రూపాలు. . వీటితో ఇండియన్ ఎయిర్‌లైన్స్ వుద్యోగులు వుద్యోగానికి రారాదని, మామూలు పద్ధతిలో (అనగానేమి) క్రాపు, మీసాలతోనే రావాలని తమ వుద్యోగులకు ఇండియనెయిర్‌లైన్స్ హెచ్చరించిందట. ఈ రకమైన పద్ధతులతో వుంటే సంస్థ తాలూకు పరువుతక్కువ వుతుందని వారు భయపడ్డారట. దీనికి కారణం కొన్ని రిపోర్టు లేనట ! సేవ్వైమ్మాప్స్ !

## ఉద్యోగం పేరుతో సంపాదన.

రాజ్‌కుమార్ బారిక్ అనే వో మేధావి తాను గయలో వున్న ఆలిండియా టూరిస్ట్ డెవలప్‌మెంట్ కౌన్సిల్ అనే వో కంపెనీ మేనేజింగ్ డైరెక్టరునని చెప్పుకుంటూ గౌహతిలోని వో పెద్ద హోటలులో బసచేసి అందమైన, డబ్బున్న, వయసులో వున్న అమ్మాయిలకు మంచి మంచి పెద్ద పెద్ద వుద్యోగాలు యిస్తానని ఒక్కొక్కరివద్ద అయిదు వేల రూపాయలు డిపాజిట్‌గా తీసుకుంటూన్నాడట. వో అస్సామీ యువతిని ఆయన రెండుసార్లు ఇంటర్వ్యూ చేసేసరికామె కనుమానం వచ్చి పోలీసులకు తెలియజేసిందట. వారు తీగ లాగేసరికి అసలు గయలో అలాటి కంపెనీయే లేదని, దానికి దేశంలో ఐదొందల బ్రాంచీలసలే లేవనీ తేలిందట. ఆ రాజకుమార్ బారిక్ యీ విధంగా యాభై లక్షలు పోగు చేశాడట. ఆయనను, ఆయనతో వున్న ఆడసెక్రటరీని కూడా పోలీసు అరెస్టు చేసిందట. ●

[ఎల్ ఐ సి పాలసీ హోల్డర్ల ప్రయోజనం కోసం ప్రకటించ బడినది.

# మీ ఎల్ ఐ సి ఏజంటు చిరునామా వ్రాసి ఉంచుకోండి




## మీ జీవిత భీమా సమస్యల అన్నింటి పరిష్కారంలో అతను సహాయ పడగలడు

మీ ఎల్ ఐ సి ఏజంటు మీకూ మిత్రము అతని కర్తవ్యం మీకు సహాయపడటం, మీ పాలసీ కాల వ్యవధి తీరేటంతవరకు...మరి అతని సహాయం ఆశించవలసిన హక్కు మీకు వున్నది. అతనితో సంబంధం ఉంచుకోండి. ఎల్ ఐ సి వ్యవహారాల్లో అతని సలహా నడగండి. మీరు అదనంగా జీవిత భీమా చేయాలని కోరితే మీకు అతను కూడా సహాయ పడగలడు.

చాలా ఎల్ ఐ సి క్లైయిములు చెల్లింప బడక పోవటం లేక ఆలశ్యం కావటం ఎందువలనంటే వాటికి సంబంధించిన అవసరాలన్నింటినీ తీర్చనందు వల్లనే. మీ ఏజంటు తీసుకోవలసిన చర్యలను గూర్చి మీకు సలహా ఇవ్వగలడు. మీ బెనిఫిషరీని పేర్కొనడం; వయస్సును గూర్చిన ఋజువు దాఖలు చేయుటం మరియు దానిని పాలసీ పై నమోదు చేయించటం; ప్రిమియములు సకాలంలో చెల్లించటం; మరియు మీ పాలసీ గల ఎల్ ఐ సి ఆఫీసుకు చిరునామా మార్పును తెలియజేయుటం మొదలైన వాటి పట్ల సలహా ఇవ్వగలడు.

మీరు పాలసీ తీసుకొన్న ఎల్ ఐ సి ఏజంటు నుంచి సహాయం పొందండి—మీ పాలసీ సక్రమంగా అమలులో ఉన్నట్లు ధృవపరచు కొనుటకు తక్షణం సక్రమ సలహాపొందండి. అవసరమైనచో, మీ సమీపంలోని ఎల్ ఐ సి ఆఫీసును సంప్రదించండి.



**లైఫ్ ఇన్సూరెన్స్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా**

( RADEUS/LIC/AS-6 TEL )



చదువులు చెప్పేవాళ్ళకు
స్కూలుకెవాలిగానీ-పాటలుపాడే
వాళ్ళకు ఎందుకండీ-అంటూ
వెక్కిరించిన **బుజ్జిబాబు**;
బెత్తం పట్టిన వాళ్ళనే
భూసానుగానీ-ఆటపాటలతో
పసిమనసుల్ని ఆకర్షించిన
పంతులమ్మ మీరేనంటూ
మెచ్చిన **బుజ్జిబాబు**,
చేసిన సహాయానికి కృతజ్ఞతలు
అందుకోక-ఆత్మీయతను
పంచుమని కోరిన **బుజ్జిబాబు**,
మధ్యలోనే ఆగిపోయే స్నేహాలు
కాకుండా-జీవితమంతా కలిసి
ప్రయాణించవలసిన వాడ్నిగురించి
ఆలోచించమని సలహా
ఇచ్చిన **బుజ్జిబాబు**,
నీ గానంతో రంగుల స్వప్నాలు-
రాగాల లోకాలు చూపెట్టావంటూ
మై మరచిపోయిన **బుజ్జిబాబు**,
పెళ్ళి విషయం అడగటానికి
వచ్చి పెళ్ళికూతురైపోయాడో
పడుచు గుండెల్లపై
పూలవాన కురిపించే
పంతులమ్మా-పోస్టుమేన్ ల
చిత్రమైన ప్రేమకథ!!

శ్రీలక్ష్మీ ప్రొడక్షన్స్

## దేవుడు చేసిన పెళ్ళి

స్క్రీన్‌ప్లే-దర్శకత్వం
**తాతినేని రామారావు**
నిర్మాత:
**ఎ. పూర్ణచంద్రరావు**

లక్ష్మీ ఫిలింస్

---

## మీకు సంతానం లేదా ?



ఆపరేషన్, ఇతర వైద్య చికిత్సలచే నిరాశ చెందిన సోదరీమణు లనేకులు మా సలహాలచే సంతానవంతులయి ఇచ్చిన యోగ్యతా పత్రములు గలవు. స్త్రీ పురుష వంధ్యాదోష నివారణ నిపుణులు.

ఉచిత వివరములకు
శ్రీ నాగార్జున మూలిక కుటీరం
రైల్వేస్టేషన్ వద్ద, రామాలయం వీధి,
తెనాలి – 2.

---

## వైద్యము

నత్తియుందా ? డా. నూ పరత్ కట్ "ఆంటి స్టామర్ సెట్" వాడి చక్కగా మాట్లాడండి. అనేకులు లాభపడ్డారు.

**Ramakant Brothers,**
**480, Shanwar peth, Poona-30.**
ఉత్తరాలు ఇంగ్లీషుతో వ్రాయండి

---

డా. పి.వి.కె. రావ్, **B.A.**, సెక్స్ స్పెషలిస్ట్



వైద్యవిద్వాన్ — వైద్యాచార్య
హస్తప్రయోగం, నరముల బలహీనత, అంగము చిన్నదగుట, శీఘ్రస్ఖలనము, శుక్లనష్టము, సుఖరోగములకు, మానసిక వ్యాధులకు శాస్త్రీయ చికిత్స, విదేశ యంత్రములతో ప్రత్యేక చికిత్స, పోస్టుద్వారా కూడా చికిత్స గలదు.

**రా పూ స్ క్లినిక్**
టి. బి. రోడ్, తెనాలి. ఫోన్ : 700

---

## నూతన నటీ నటులు కావలెను

శ్రీ విజయ వినాయక ఆర్ట్ ఫిలిమ్స్‌వారి తొలి చిత్రములోని పాటలను రికార్డు చేయబడినవి. మార్చి ఆఖరి వారములో షూటింగుకి వెళ్ళనున్న నా ఈ చిత్రములో నటించుటకు అందం, ఉత్సాహము, అనుభవము ఉన్న నూతన నటీ నటులు తమ వివరములను తెలుపుతూ మూడు పోజులలో తమ ఫోటోలను పంపుకోనవలెను. దరఖాస్తులు 7–3–75 వరకు స్వీకరించబడును.

ప్రొడక్షన్స్ ఎగ్జిక్యూటివ్, శ్రీ విజయ వినాయక ఆర్ట్ ఫిలిమ్స్
D. No. 26-31-112, A. T. Agraharam, GUNTUR–4 (A.P.)

---

## మీకేయే వస్తువులు కావాలి?

**స్టీలు పాత్రలు, టెర్లిన్, టెరికాటన్ బట్టలు, టైం పీసులు, కెమెరాలు, రిస్టువాచీలు, ట్రాన్సిస్టర్లు, సైకిళ్లు మరియు మీకే వస్తువు కావలసినా మా "సేవింగ్సు సహకార పద్ధతిని" రు. 5/- లకే పొందండి. (వివరములకు అడ్రసుగల పోస్టుకవరు పంపవలెను)**

**S. K. C. C. CORPORATION**
Danavaipet – 533103    RAJAHMUNDRY – 3

**Printed and Published by S. NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Street, Gandhinagar. Vijayawada-3. Editor: S. Radhakrishna**

అమ్మాయికి. అన్నదమ్ములు, తోబుట్టువులు ఎవరూ వుండకూడదు."

"వూఁ" అన్నాడు రాజారావు పళ్ళుకొరుకుతూ.

"తల్లిదండ్రులు కూడా వుండకుండావుంటే మంచిది."

"ఆఁ" అన్నాడు రాజారావు లోపలే కారాలు మిరియాలు నూరుతూ.

"కుర్రవాడు ఎర్రగా వుండాలి. పుష్టరు అయినవాడు అయివుండాలి. ప్రాక్టీసు పెట్టి రెండు చేతులా ఆర్జిస్తున్నవాడయి వుండాలి. మంచి పొడగరి అయివుండాలి. ఎప్పుడూ నవ్వుతూ వుండేవాడు అయివుండాలి. ఏడ్పు మొగం కాకూడదు. అత్త మామల ఎడల భక్తిశ్రద్ధలు, భయ గౌరవాలు వుండినవాడైతే మరీమంచిది. ప్రాక్టీసు బస్తీలో అయితే బావుంటుంది. గవర్నమెంటు వుద్యోగము కూడా వుంటే మరీ బాగు. వింటున్నావా?"

"ఆఁ. చెప్పు బావా."

"రాజారావు! నువ్వు పదిమందితో తిరుగుతావు; పదిమంది నీకు తెల్సివుంటారు అని నీకు చెపుతున్నాను. చూడు. ఏవో సంబంధాలు వస్తున్నాయనుకో. కాని ఒకటి వుంటే ఒకటి వుండివావక నచ్చటంలేదు. అదీ సంగతి."

"బాగానే వుంది బావా, నీ ఆలోచన."

"నువుమాత్రం మనసులో వుంచుకో. ఎంత కర్చయినా ఫర్వాలేదు. వెనకాడేది లేదు. కావాలంటే నీకయిన కర్చులు కూడా ఇస్తాము. ఆ బెంగ అక్కర్లేదు."

"మమ్మల్ని మరీ అంత తీసిపారెయ్యకు బావా!

# రంగులవల

(27వ పేజీ తరువాయి)

మేనగోడలి గురించి అమాత్రం శ్రమ నేను పడగలను." ఏడ్పు నణచుకొంటూ నవ్వాడు రాజారావు.

అంతలో కాంతమ్మ వచ్చి భోజనానికి పిల్చింది.

"భోజనం చేసివచ్చావా? నీకుకూడా వడ్డించమంటావా?" అన్నాడు భూషయ్య అదోకలాగ సకిలించి, రాజారావుని.

"ఓరి రాస్కెల్. నీ కళ్ళు పూర్తిగా మూసుకుపోయేయి. అందుకే బోసుబాబు క్షణం వుండకుండా వచ్చేసాడు. కాని నేను అట్లాకాదురా. నీ అంతు చూస్తాను." అనుకొని "బావగారు హాస్యబ్రహ్మలవుతున్నారు." అని నవ్వాడు, రాజారావు.

భోజనాల దగ్గర ఎవరూ అంతగా మాట్లాడలేదు.

మంజుల, కాంతమ్మ వడ్డించారు.

భూషయ్యే తెగ బాధ పడిపోతూ "మూడు కూరలు, పచ్చళ్ళు రెండు, పులుసు, చారు, రసపూ! మీ ఇంట్లో ఎన్ని కూరలు చేసుకుంటారోయ్?. ఒకటయినా వుంటుందా అని." అని నవ్వాడు.

భూషయ్య నవ్వినప్పుడు బుగ్గలు వుబ్బుతాయి. కళ్ళు మూసుకుపోతాయి. ముడ్డి గిల్లి జోలపాడిన చందాన వుంటుంది భూషయ్య తీరు. పుండుమీద కారం రాసి కెలికినట్లు వుంటుంది ఆ ధోరణి.

అది విననట్లుగ కాంతమ్మతో కబుర్లలో పడ్డాడు రాజారావు.

"పుట్టింటతరపు చుట్టాలొస్తే, మా అక్కకి అసలు ఒళ్ళే తెలియదు." అంటున్నగతాన్ని ప్రకాశంగానే అన్నాడు భూషయ్య. అన్నీ వింటూనే విన్పించుకోనట్లు కాంతమ్మతో ఆ మాటా ఈ మాటా అంటు వుండిపోయేడు రాజారావు.

భోజనాలు అవుతున్నంతసేపూ చిటపట లాడుతూనే వున్నాడు భూషయ్య. దానికి ప్రత్యక్షమైన కారణం లేదుగాని పరోక్షమైన కారణాలు మాత్రం వున్నాయి. రాజారావు రావటం, అతను వచ్చాడని ఆడావుడిచేసి మరో రెండు కూరలు పాయసం అంటు కాంతమ్మ హడావుడి చెయ్యటం భూషయ్యకి నచ్చలేదు. మొదట్నుంచీ నా చిన్నిపొట్టకు శ్రీరామరక్ష అన్న ధోరణి భూషయ్యది. భూషయ్యకి డబ్బుమీద ఎంతో ఆపేక్ష, నమ్మకమూ. అది వుంటే చాలు మిగతావి ఏవున్నా లేకపోయినా పర్లేదన్న ధోరణి అది. డబ్బుతో ఏమయినా సాధించవచ్చునన్న విశ్వాసం అతనిది. ఇంటికి వచ్చిన ప్రతివాడూ తన డబ్బున్నూసి డబ్బుకోసమే వస్తున్నాడనీ, తను ఏమాత్రం అజాగ్రత్తగా వున్నా అవతలివాడు తన లక్ష్మీదేవిని ఎత్తుకుపోవటాన్కి రడీగా వున్నాడనీ అనుకోవటంవల్లనే ముఖ్యంగా భూషయ్య మాటలు అలా బాణాల్లా వదుల్తున్నాడు.

"తినిపోవటాన్కి వస్తారు" అంటు పైకే గొణుగుతాడు.

"తేరగా వుందని వస్తారు." అంటు సణుగుతాడు.

(ఇంకా వుంది)

అందుకే కొన్ని అన్యోన్యంగా ఉంటున్నట్లు నిర్ధారణగా తెలిసిన దంపతుల నెవరిని చూసినా చాలామందికి అసూయగా ఉంటుంది. ఆ అసూయను కప్పిపుచ్చుకునే నిమిత్తం ఆ దంపతులలో ఉన్న లోపాలను గోరంతలు కొండంతలు చేసి ఊహించుకుని తృప్తి పడుతుంటారు.

శ్యామల, రవి చాలా అన్యోన్యంగా ఉంటారనీ, ఇద్దరికీ యీడూ జోడూ కుదరటమేకాక మనస్ఫూర్తిగా ఒకరినొకరు కోరుకుని ప్రేమించుకుని పెళ్లాడారనీ, పెళ్లయిన తరువాతకూడా వారి ప్రేమలో ఎట్టి మార్పూ లేదనీ గ్రహించటంవల్లనే వాళ్ల చుట్టూ ఉన్న మనుష్యులలో అప్రయత్నంగానే వారి యెడల అసూయ జనించింది. అందుకే అటు రవి మనసునీ, యిటు శ్యామల మనసునీకూడా ఏదో ఒక రకంగా కలవరపరచటానికి ప్రయత్నించేరు. వాళ్ల ప్రయత్నం ఫలించింది. భార్యా భర్త లిద్దరూ దూరమైనారు.

ఆ వియోగం వాళ్లకెంతటి దుర్భరమైన బాధను కలిగిస్తుందోకూడా అందరికీ తెలుసు. కాని ఆ బాధలోని నిజాయితీనికూడా వాళ్లు భరించలేరు. శ్యామల భర్తని వదిలిపెట్టి మరేపురుషుడితోనో లేచిపోయినా, లేదా విశృంఖలంగా, కులాసాగా గడిపినా ఆమె చుట్టూ ఉన్న మనుష్యులకు అంతగా బాధ ఉండేదికాదు. ఆమె సంగతినికూడా అంతగా పట్టించుకునేవారు కాదు. కాని శ్యామల నిజంగా తను చేసిన పని తప్పని భావించి పశ్చాత్తాప పడుతుండేసరికి ఆమెను మరింత బాధ పెట్టాలన్న

# అహం — అనురాగం

(30వ పేజీ తరువాయి)

క్రూరమైన కోరిక వారిలో తలెత్తింది. ఇతరులు బాధ పడుతుంటే చూసి సంతోషించి, అలా తమ బాధలను తాత్కాలికంగా మర్చిపోయే మనస్తత్వం చాలామంది సామాన్య మానవులల్లో ఉంటుంది. అందుకే శ్యామలకు తను పడే బాధలకు చుట్టుపక్కలవారి సూటీపోటీ మాటలు కూడా తోడై జీవితం మరింత దుర్భరం కాసాగింది.

తన కడుపును చీల్చుకువచ్చి యీ లోకంలో ప్రవేశించిన ఆ పసికందు ముఖం చూసేక ఆమె ఎంత బాధనైనా ఓర్చుకోవటానికి సిద్ధపడేది. మరణించే హక్కు తనకు లేదని తనని తానే శాసించుకునేది.

అంతేకాదు. రవి మనసుకు కష్టం కలిగించినా అతని తమ్ముళ్లను, చెల్లెలిని వృద్ధిలోకి తీసుకువచ్చి అలాగైనా రవి కిష్టమైన, సంతోషకరమైన పని చేయటం తన బాధ్యత అనుకుంది శ్యామల.

తనుకూడా వీళ్లని వదిలివేస్తే వీళ్ల గతి యేమిటి? రవికి అర్ధాంగిగా తనని ఏనాడు సమర్పించుకున్నదో ఆనాడే అతనికి సంబంధించిన వాళ్లందరూ తనవాళ్లయినారు. తన ఒక్కదాని స్వార్థం కోసం వీళ్లందరినీ బజారుపాలు చెయ్యటం భావ్యం కాదనిమనసు రాయిచేసుకుని జీవించసాగింది శ్యామల.

మనసునిండా పుట్టెడు దిగులుండటంతో శ్యామలకు తన శరీరం మీద, తన వేషధారణమీద ఆసక్తి అనేదే ఉండటంలేదు. స్వభావసిద్ధంగా శ్యామల అలంకార ప్రియ. రంగు రంగుల చీరలతో, రకరకాల హెయిర్ స్టైల్సుతో ఆధునికమైన అలంకార సామాగ్రితో తన అందానికి మెరుగులు దిద్దుకుంటూ ఉండేది శ్యామల.

అలాటిది భర్తకి దూరమయేసరికి అలంకరణ అంటేనే ఆమెకు అసహ్యం వేయసాగింది. లేత రంగులలో ఉండే నేత చీరలను మాత్రం కట్టుకోవటం ప్రారంభించింది శ్యామల. ముఖాన బొట్టు, మెడలో మంగళసూత్రం, ఎడమ చేతికి రిస్టువాచీ, కుడిచేతికి రెండు మట్టి గాజులు తప్ప మరే ఆభరణాలూ ఆమె శరీరంమీద ఉండేవికావు. పౌడరు, స్నోవంటి సౌందర్య సాధనాలను వాడటం కూడా మానివేసింది.

ఇలా ప్రయత్న పూర్వకంగా ఆమె అందహీనంగా తయారవుతుంటే మరొకవంక దిగుళ్లతో కృశించి వడలిపోయిన ఆమె శరీరం సహజంగానే తన సౌందర్యాన్ని, సౌకుమార్యాన్ని కోల్పోవసాగింది.

రవి వెళ్లిపోయి మూడు సంవత్సరాలు గడచినయ్. ఆ మూడు సంవత్సరాలూ ఆమెను శారీరకంగా, మానసికంగా ఎన్నో హింసలకు గురిచేసినయ్. ఆడవాళ్ల సూటీపోటీ మాటలకుతోడు కొందరు ఆమె యింటి చుట్టుపక్కల ఉండే రౌడీలు ఆమె ఒంటరి బ్రతుకును చూసి ఓరకంటితో ఆమెను పలకరించటానికి ప్రయత్నించేవారు. భర్తని వదిలిన స్త్రీకి శీల రక్షణకూడా చాలా కష్టమని అనుభవపూర్వకంగా తెలిసివచ్చిందిశ్యామలకు. [ఇంకా వుంది]



తారకరామా పిక్చర్స్ వారి

# కథానాయకుని కథ

దర్శకత్వం: డి. యోగానంద్ నిర్మాత: కె. డి. వి. ప్రసాద్, బి.ఇ.,

విజయా కంబైన్స్

VIJAYA